## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100061855

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

జనరంజక గ్రంథావళి 45

చరిత్ర

# సి.పి.బ్రౌన్ చరిత్ర

రచయిత

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

కార్యదర్శి

సి.పి.బ్రౌన్ మెమోరియల్ ట్రస్ట్

*1/1845, గాంధినగర్, కడప — 516 004*



**తెలుగు అకాడమి**

**హైదరాబాదు**

**1992**

# భూమిక

ఇంటర్మీడియట్, డిగ్రీ తరగతులకు అవసరమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలను, అనువాద వాఙ్మయాన్ని, మోనోగ్రాఫ్‌లను ఇంతవరకు తెలుగు అకాడమి ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల, విద్యావేత్తల ఆదరాభిమానాలను విశేషంగాచూరగొన్నదని వేరే చెప్పనక్కర్లేదు. అయితే అంతటితో తన బాధ్యత తీరినట్లుగా అకాడమి భావించడంలేదు. కొత్తగా చదువు నేర్చుకొన్నవారికి, పాఠ్యప్రణాళికలతో నియత విద్యారంగంతో (formal education field) సంబంధం లేకుండా జ్ఞానోపార్జన చేయదలచినవారికి, విద్యార్థులకు, అధ్యాపకులకు జనరంజక గ్రంథావళి వల్ల ప్రయోజనముంటుందని భావిస్తున్నాం. నిత్యజీవితంతో సన్నిహిత సంబంధమున్న వివిధ శాస్త్రాంశాల విజ్ఞానాన్ని, సమకాలీన సమస్యల, పరిష్కారాల పరిజ్ఞానాన్ని అందరికీ అందించే సదుద్దేశంతో సరసమైన ధరలకు ఈ గ్రంథాలను వెలువరిస్తున్నాం. 'ప్రయోజనాత్మకమైన తెలుగు' సదస్సు సిఫార్సుల మేరకు ఈ గ్రంథాల ప్రచురణను చేపట్టాం. వివిధ రంగాలలో ప్రాయోగికానుభవంగల నిపుణులను రచయితలుగా ఎన్నుకొన్నాం. భాష సరళంగాను, అందరికీ అర్థమయే రీతిలోనూ సాధ్యమయినంత తక్కువ సాంకేతిక పదజాలంతో ఉండేటట్లు రచించే ప్రయత్నం జరిగింది. అంతేకాకుండా ఇచ్చిన సమాచారం అధికారికంగా ఉండేటట్లు తగిన శ్రద్ధ తీసుకొన్నాం. ఈ గ్రంథాలు అందరి ఆదరాభిమానాలకూ పాత్రమౌతాయని ఆశిస్తున్నాం.

విమర్శకులు సౌహార్దంతో ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పకుండా పరిశీలించగలం.

# నివేదన

ఈ రచనకు ప్రధానంగా డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారి సి.పి. బ్రౌన్ జీవిత చరిత్ర తొలి మలి ప్రచురణలు, కీ॥శే॥ బంగోరె, డా॥ ఆరుద్ర, డా॥శ్రీమతి ఆర్. పద్మావతి గార్ల రచనలు నా కెంతగానో ఉపకరించాయి. వారికి నా కృతజ్ఞతలు.

వ్రాతప్రతిని అత్యంత శ్రద్ధాసక్తులతో సరిచూచిన మిత్రులు శ్రీ పింజల బుల్లయ్య (రిటైర్డ్ ఇంగ్లీషు లెక్చరర్) గారికి,

బ్రౌన్ సేకరించిన చాటువులు మరియు బ్రౌన్ ప్రశంసాపద్యాలు వ్రాసి యిచ్చిన మిత్రులు శ్రీ.క. జయచంద్రనాయుడు (తెలుగు లెక్చరర్) గారికి,

బ్రౌన్ చరిత్ర రచనాభారాన్ని నాకు అప్పగించిన జనహిత అధ్యక్షులు జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావు గారికి, కార్యదర్శి శ్రీ. సి. ధర్మారావు గారికి, జనహిత కార్యవర్గ సభ్యులందరికి నా ధన్యవాదాలు.

ఈ రచనలో ముద్రింపబడిన సి.పి.బ్రౌన్ ఊహా చిత్రాన్ని చిత్రించిన మిత్రులు "లలిత కళానిధి" శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యం గారికి, బ్రౌన్ గ్రంథాలయ భవనం,బంగళా శిథిలాలు, బిషప్ కాల్డ్వెల్ చిత్రాలను సమకూర్చిన మిత్రులు శ్రీ యం. శివశంకరయ్యగారికి కృతజ్ఞతాంజలులు.

గ్రంథ ప్రచురణ బాధ్యతను స్వీకరించిన తెలుగు అకాడమి డైరక్టర్ శ్రీ సి.యన్.వి. సుబ్బారెడ్డి గారికి, అధికార వర్గం వారికి నా నమస్సులు.

— జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ప్రవేశిక

ఆంగ్లేయులు మన దేశానికి వ్యాపారులుగా వచ్చారు. వర్తకం చేసేందుకు 31-12-1600 తేదిన ఈస్టిండియా కంపెనీని ప్రారంభించారు. క్రమక్రమంగా రాజకీయ రంగంలో ప్రవేశించారు. విశాలమైన భూభాగాలను సంపాదించి 1856 నాటికి భారతదేశ సార్వభౌములయ్యారు.

కంపెనీ ఉద్యోగులలో అత్యధికులు మన దేశ సంపదలను అక్రమంగా తమ దేశానికి తరలించారు. ఆనాటి భారతీయ సమాజం కూడా కులమత విద్వేషాలతో మూఢవిశ్వాసాలతో అస్తవ్యస్తంగా ఉండేది. కంపెనీ పాలనలో ఉన్న భారత భూభాగంలో బానిస వ్యాపారం విరివిగా సాగుతుండేది. ఒక్కొక్క బానిస ఈస్టిండియా కంపెనీకి నాలుగు రూపాయల నాల్గణాలు సుంకంగా చెల్లించేవాడు. ఈ విధంగా దేశం దోపిడీకి గురి అవుతుండేది.

కాని "పురుషులందు పుణ్య పురుషులు వేరయా" అన్నట్లు కంపెనీ ఉద్యోగులలో కొందరు ఉదార హృదయులు ఉండేవారు. భారతదేశ నాగరికతను, సంస్కృతిని అర్థం చేసుకొన్న ఆ కొందరే భారతీయులలో భావ విప్లవానికి దోహదం చేశారు. ఆ విధంగా భారతదేశ హితైక దృష్టితో భారత జాతి జాగృతికి కృషి చేసిన వారిలో ముఖ్యుడు సర్ విలియం జోన్స్. కలకత్తా సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా ఉండిన విలియమ్ జోన్స్ బహుభాషా కోవిదుడు. మానవతా వాది. సంస్కృత భాషలో తలస్పర్శి పాండిత్యం గడించిన జోన్స్ అభిజ్ఞాన శాకుంతలం వంటి చాలా గ్రంథాలను ఆంగ్లీకరించాడు. పార్శీభాషలో దిట్ట అయిన ఆయన పార్శీ భాషకు వ్రాసిన వ్యాకరణం ప్రసిద్ధమైనది. ఛార్లెస్ విల్కిన్స్ (1750 - 1836), హెన్రీ థామస్, కోల్‌బ్రూక్ మొదలైన ప్రతిభావంతులైన ఆంగ్లేయులు భారతీయ భాషలలో ప్రవీణులై, పాశ్చాత్యులలో భారతీయులపట్ల దురభిప్రాయాలను తొలగించటానికి గట్టి కృషి చేశారు. భారతీయులలో ఆత్మ విశ్వాసాన్ని పెంపొందింప చేశారు.

తెలుగు ప్రజలను, చరిత్రను తెలుగు భాషా సాహిత్యాలను మనసారా ప్రేమించిన ఆంగ్లేయులలో మరువరాని మహనీయులు సర్ ఆర్థర్ కాటన్ (1803-99), కల్నల్ కాలిన్స్ మెకంజీ (1758 - 1821), సర్ థామస్ మన్రో (1761 - 1827) ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (1798 - 1884) ముందుగా చెప్పుకోదగినవారు.

సర్ ఆర్థర్ కాటన్ గోదావరి పై ధవళేశ్వరం వద్ద ఆనకట్ట కట్టించి పదిలక్షలు ఎకరాల పైచిలుకు భూములు సుక్షేత్రాలు కావటానికి దోహదం చేశాడు. మెకంజీ కైఫియత్తులుగా ప్రసిద్ధములైన స్థానిక చరిత్రలను రచించి చారిత్రక సామగ్రిని సేకరించిన మహనీయుడు కల్నల్ కాలిన్స్ మెకంజీ. రాయలసీమ ప్రజలను తరుచుగా దోచుకుంటున్న పిండారి ముఠాలను కఠినంగా అణచివేసి సీమలోని దుర్మార్గులైన పాళెగాళ్ళ దోపిడిని అరికట్టి ప్రజల మన్ననలందుకున్న పాలనాదక్షుడు సర్ థామస్ మన్రో.

తెలుగు భాషా సాహిత్యాల సముద్ధరణకు జీవితాంతం కృషి చేసి అమూల్యమైన వ్రాత ప్రతులు తాళపత్రాల సేకరణలోను గ్రంథపరిష్కరణలోను నిఘంటు నిర్మాణంలోను తెలుగు వారికి మార్గదర్శకుడైన ఆంగ్లేయ ఉద్యోగి సి.పి. బ్రౌన్. ఈ మహనీయుడే మన కథానాయకుడు.

## విషయసూచిక



## అనుబంధాలు

# 1. వంశం – జననం – విద్యాభ్యాసం

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ 1798 నవంబర్ 10వ తేదిన కలకత్తాలో జన్మించాడు. రెవరెండ్ డేవిడ్ బ్రౌన్, కౌలే దంపతులకు ఇతడు రెండవ కుమారుడు.

డేవిడ్ బ్రౌన్ తాత్త్విక మత సంబంధములైన విషయాలతో పాటు గ్రీక్, లాటిన్ భాషలలో కూడా పండితుడు. విద్యార్థి దశ నుండే సంఘసేవానురక్తిని పెంచుకొన్నవాడు.

కలకత్తాలోని తెల్లదొరల పిల్లలకోసం ఒక ' విద్యాసంస్థ – శరణాలయం ' స్థాపింపబడింది. ఆ సంస్థ నిర్వహణకు కొందరు మిత్రులు డేవిడ్ బ్రౌన్ పేరును ఈస్టిండియా కంపెని వారికి సూచించారు. ఆ ఉద్యోగానికి వివాహితుడే అర్హుడు. సంస్థ నిర్వహణతో పాటు అర్చకత్వం కూడా సాగించవలసి ఉండేది. అప్పటికి డేవిడ్ బ్రౌన్ అవివాహితుడు. అయనప్పటికి ఇరువై మూడేళ్ళ వాడే. మతగురువు లెవరూ అతడికి అర్చకత్వదీక్ష ఇవ్వడానికి ముందుకు రాలేదు. అయితే 1785 లో కేంటర్బరీ ఆర్చిబిషప్ డేవిడ్ బ్రౌన్‌కు పురోహిత దీక్షనిచ్చాడు. అదే సంవత్సరం డేవిడ్ బ్రౌన్ మిస్ రాబర్ట్‌సన్‌ను పెళ్ళిచేసుకొన్నాడు. ఆ తర్వాత కొన్ని నెలలకు భార్యతో పాటు డేవిడ్ బ్రౌన్ తాను ఉద్యోగం చేయవలసిన ఇండియాకు బయలుదేరాడు. ఓడపై ప్రయాణం ఆరునెలలు పట్టేది. ప్రయాణ కాలంలోనే బెంగాలి భాషను నేర్చుకొన్నాడు. మార్గ మధ్యంలో భార్య మగబిడ్డను ప్రసవించింది. ఆ దంపతులు తమ బిడ్డతో 1786 జూన్ 18 వ తేదిన మనదేశంలో అడుగుపెట్టారు.

అయితే పాపం వాళ్ళకు ప్రథమ సంతానం దక్కలేదు. 'ఒకటిన్నర సంవత్సరాల వయసులోనే బిడ్డడు కన్నుమూశాడు. పుత్రుని మృతి అతనికెంతో బాధ కల్గించింది. కాని విద్యాసంస్థలోని పిల్లలలో తమ వాత్సల్యాన్ని పండించుకున్నారా దంపతులు.

అధికారులు శరణాలయం పనులనుండి బ్రౌన్‌ను తప్పించారు. అతడు ఇంటి దగ్గర కొందరు పిల్లలకు ఉచితంగా విద్య నేర్పటానికి ఒక ధార్మిక పాఠశాలను ప్రారంభించాడు. వీలున్నపుడల్లా జైళ్ళకు ఆసుపత్రులకు వెళ్ళి ధర్మ ప్రచారం చేసేవాడు.

హిందూ మతాన్ని గూర్చి బాగా తెలుసుకోవటానికి రెవరెండ్ బ్రౌన్ సంస్కృతభాషను నేర్చుకొన్నాడు భాషలలోనే కాక సామాన్య విషయాలలో కూడా అభిరుచికల బ్రౌన్ తన ఇంటనే ఒక గ్రంథాలయం నెలకొల్పాడు. భారతీయ భాషల పదజాలంతో ఒక కోశాన్ని తయారు చేశాడు. ఇండియన్ సివిల్ సర్వీసులో చేరువారికి భారతీయ భాషల పరిజ్ఞాన నాగరికతా సంస్కృతులను బోధించాలన్న ఉద్దేశంతో మార్క్విస్ వెల్లసీ కలకత్తాలో ఫోర్ట్ విలియం కాలేజిని ప్రారంభించాడు. ఆ కళాశాల ప్రొవోస్టుగా డేవిడ్‌బ్రౌన్ నియమింపబడినాడు. కళాశాల అభివృద్ధికి ఎంతో కృషి చేశాడు.

డేవిడ్ బ్రౌన్ కలకత్తాకు పదిహేను మైళ్ళదూరంలో హుగ్లీ నదికి పడమటి తీరంలో ఒక ఇంటిని కొన్నాడు. ఇంటిపేరు ఆల్డీన్ . డేవిడ్ బ్రౌన్, ఫ్రాన్సిస్‌కౌలే దంపతుల గార్హస్థ్య జీవనం సుఖంగా సాగింది. వారికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు పుట్టారు. ఆ దంపతుల రెండవ కుమారుడే ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్.

డేవిడ్ బ్రౌన్ ఉదార హృదయుడు. నిత్యమూ అతిథులు వారి ఇంట ఉండేవారు. ఆయన తన కుమారులకు తానే చదువు చెప్పేవాడు. హీబ్రూ భాషలో స్వయంగా పండితుడైన బ్రౌన్ విద్యార్థులు గ్రీక్, లాటిన్, సిరియన్, అరబిక్, పార్సీ భాషలను, నేర్చుకోవాలని ప్రోత్సహించేవాడు. కలకత్తా సమీపంలో నివసిస్తున్నందున ముగ్గురు పిల్లలు అరబిక్, పార్సీ హిందుస్తానీ భాషలను చక్కగా మాట్లాడేవారు. నేటివ్ పండితుల వద్ద బ్రౌన్ కుమారులు సంస్కృత భాష నేర్చుకున్నారు.

తన ముగ్గురు కుమారులలో రెండోవాడైన సి.పి. బ్రౌన్ ఆంగ్లసాహిత్యం పట్ల అమితమైన అనురక్తిగలవాడని డేవిడ్ బ్రౌన్ తన జ్ఞాపకాలలో వ్రాసుకొన్నాడు. రెండో కుమారునికి చిన్నప్పుడే గ్రంథపరిష్కరణలోను పాఠభేదాలను గుర్తించడంలోను మంచి తర్ఫీతు ఇచ్చాడు. అమూల్యమైన గ్రంథాల సేకరణ, ఉత్తమమైన సంస్థలకు వాటిని దానమివ్వటం వంటి సద్గుణాలను పుణికి పుచ్చుకొన్నాడు సి పి బ్రౌన.

అవిశ్రాంతంగా పనిచేయుటవల్ల డేవిడ్ బ్రౌన్ ఆరోగ్యం క్షీణించి 1812 జూన్ 14 వ తేదిన కన్ను మూశాడు

తన సౌజన్యంతో, పాండిత్యప్రతిభతో అందరి మన్ననలందు కొన్న డేవిడ్ బ్రౌన్ మృతి ప్రజలకెంతో బాధ కల్గించింది ఆయన ఆ కాలంలో ఏటా పదివేలు వేతనం తీసుకుంటున్నప్పటికి డేవిడ్ బ్రౌన్ చనిపోయేనాటికి కుటుంబం ఆర్థికంగా ఇబ్బందులలో ఉండేది. ఆయన సంపాదనలో అత్యధిక భాగం అతిథి సత్కారాలకే ఖర్చు అవుతూ వచ్చింది.

బ్రౌన భార్య పిల్లలతో ఇంగ్లండు వెళ్ళాలని నిశ్చయించింది. ప్రయాణానికి కావలసిన పైకం అవసరమైంది రెవరెండ్ బ్రౌన్ ఉపన్యాసాలను, జీవిత చరిత్రను కలిపి అచ్చువేయదలచారు. రెవరెండ్ ఛార్లెస్‌సిమియన్, బ్రౌన్ భార్య చేత డేవిడ్ బ్రౌన్, జీవిత చరిత్ర వ్రాయించి మెమోరియల్ స్కెచెస అనుపేర 1816 లో అచ్చువేయించాడు. 193 ప్రతులను పంచి 19300 రూపాయలను ప్రోగుచేసి బ్రౌన భార్యకు అందజేశాడు. రెవరెండ్ డేవిడ్ బ్రౌన్ పట్ల సమకాలీనులైన మిత్రులు అభిమానులు చూపిన గౌరవం అతని ఘనతను చాటుతున్నది. డేవిడ్ బ్రౌన్ కుటుంబం ఇంగ్లండుకు తరలి వెళ్ళింది. అప్పుడు సి.పి.బ్రౌన్‌కు పద్నాలుగేళ్ళు.

## ఇంగ్లండులో విద్యాభ్యాసం

ఇండియాలో తమ కొలువులో ఉండి మరణించిన వారి పిల్లలను సర్వీస్ లో చేర్చుకొని ఉద్యోగాలివ్వటం కంపెనీ వారి నియమంగా ఉండేది. ఆ మేరకు డేవిడ్ బ్రౌన్ కుమారులు హెయిలెబురి కాలేజిలో చేరారు. వారి ఉద్యోగ నిర్ణయం కూడ జరిగింది.

సి.పి బ్రౌన 1814 జనవరిలో కాలేజిలో చేరాడు. రెవరెండ్ జోసఫ్ ఎచ్ బేటన్, ఆ కాలేజి ప్రిన్సిపల్. అలెగ్జాండర్ హేమిల్టన్ భారతీయ సాహిత్యేతిహాసాలను బోధించేవాడు. పాశ్చాత్య విద్యలలో ఛార్లెస విల్కిన్స్, మౌల్వీ మీర్జా ఖలీల, మున్షీ గులాం హైదర్‌లు కూడా పనిచేసేవారు.

హెయిలెబరి కాలేజిలో లాటిన్, గ్రీక్ భాషలు, రాజనీతి, అర్థశాస్త్రం, చరిత్ర, న్యాయశాస్త్రం మొదలైన వాటితో పాటు సంస్కృతం, పార్సి, అరబిక్, బెంగాలి భాషలను నేర్పేవారు దక్షిణ భారత భాషల అధ్యయనం లేదు.

హెయిలెబరీ కాలేజిలో సంస్కృతంలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు బంగారు పతకాలు ఇస్తూ ఉండేవారు. పతకం అంచుచుట్టూ " తత్సుఖం సాత్వికం ప్రోక్తం ఆత్మబుద్ధి ప్రసాదజమ్ " (భగవద్గీత 18.37) శ్లోకపాదం వ్రాసి ఉండేది. పతకం మధ్యభాగంలో, శ్రీవిద్యావరాహా' అని చెక్కబడి ఉండేది. (భారతి - జనవరి 1979 సంచిక - బ్రౌన్ స్వీయ సారస్వత కథనం పుట 77-నిడదవోలు వెంకటరావుగారు)

కంపెనీవారు తాము శిక్షణకు పంపిన విద్యార్థులను భారతదేశంలోని ఏ రాజధానికి పంపాలో ముందుగానే నిర్ణయించేవారు. తెలుగువారి అదృష్టంకొద్దీ సి.పి.బ్రౌన్ ను మద్రాసు సర్వీసుకు, అతని సోదరులను బెంగాల్ సర్వీసుకు కేటాయించారు.

కాలేజిలో చదువుతున్నప్పుడు సి.పి.బ్రౌన్ హిందుస్తానీలో చిన్న బహుమతి సంపాదించాడు. తల్లి సలహా మేరకు రోజువారి వ్యవహారాలు, భావాలు వ్రాస్తూ ఉండేవాడు. ఈ చర్య జ్ఞాపకశక్తి పెరుగుదలకు దివ్యౌషధంలా పనిచేసేదట.

1817 ఆగష్టు 4న రైటర్ ర్యాంక్ తో సి.పి.బ్రౌన్ మద్రాస్‌లో కాలుపెట్టాడు. 13న ఫోర్ట్‌సెంట్ జార్జి కాలేజిలో చేరాడు. అప్పటికి పాశ్చాత్య ప్రపంచంలో తెలుగు భాషను గూర్చి తెలియదు. తండ్రి డేవిడ్ బ్రౌన్‌కు తెలుగు తెలుసు. విశాఖపట్నం నుంచి ఆనందరాయర్ తెలుగులో వ్రాసిన జాబులు ఇంగ్లీష్ అనువాదంతో వెళ్ళేవి. సి.పి.బ్రౌన్ వెలగపూడి కోదండరామ పంతులు గారి వద్ద తెలుగు అక్షరాభ్యాసం చేశాడు. పరీక్షల్లో బ్రౌన్ మామూలుగానే ఉత్తీర్ణుడయ్యేవాడు. సెకండ్ క్లాస్‌లో పాసయ్యాడు. కాలేజి లైబ్రరీ నుంచి గ్రీక్, హిందూ పురాణ గాథలను చదివేవాడు. ఫ్రెంచి భాష కూడ అభ్యాసం చేశాడు. ఇంగ్లీష్‌లో కవితలల్లేవాడు. అలా వ్రాసిన అభ్యాస కవితలను కాల్చిపారవేసేవాడు. ఒక కవితాఖండిక మాత్రం దక్కింది

ఈ కాలేజిలో చదివేవారందరు విధిగా రెండు భారతీయ భాషలు నేర్చుకోవాలన్ననియమం ఉండేది. బ్రౌన్ మొదట్లో తెలుగు -మరాఠి నేర్చుకుంటానని దరఖాస్తులో పేర్కొన్నాడు. తర్వాత మరాఠీ బదులు హిందుస్తాని నేర్చుకొంటానన్నాడు. గత్యంతరం లేక తెలుగుతో పాటు మరాఠి నేర్చుకొన్నాడు. కాలేజిలో చదువుతున్న కాలంలో పెద్ద స్వంతగ్రంథాలయం ఏర్పాటు చేసుకున్నాడు

మూడేళ్ళ శిక్షణానంతరం జరిగిన పరీక్షలో బ్రౌన్ ద్వితీయ శ్రేణిలో కృతార్థుడయ్యాడు. అప్పట్లో సర్ థామస్ మన్రో మద్రాసు గవర్నర్ గా ఉండేవాడు. లోగడ మన్రో 1800-1807 వరకు కడప జిల్లా కలెక్టర్. ప్రజల సంక్షేమానికి అవిరళంగా కృషిచేసిన మన్రో దొర 1827 లో రాయలసీమ లోని పత్తికొండలో చనిపోయాడు.

గవర్నర్ మన్రో సివిల్ సర్వీస్ శిక్షణ పొందిన ఉద్యోగులను నుద్దేశించి కాన్వొకేషన్ లో మాట్లాడుతూ "దేశభాషలలో వ్యవహార జ్ఞానం లేకపోతే మిగతా జ్ఞానాలన్నీ సివిల్ సర్వీస్‌లో

నిరుపయోగం. చక్కని భాషా జ్ఞానం ఒక సాధనమే, సత్పరి పాలన గమ్యంగా భావించాలి. దేశ ప్రజల గురించి ఏర్పరచుకున్న దురభిప్రాయాలకు స్వస్తి చెప్పాలి. భారతీయుల మధ్య బహుకాలం సంచరిస్తూ జీవించిన వాళ్ళెవరైనా వారి సద్గుణాల్ను మెచ్చుకొంటారు. ప్రజలతో సద్భావం వుంటే అదే ఏ ప్రభుత్వానికైనా రక్ష అన్నాడు. ఆ మాటలు సి.పి. బ్రౌన్ పై చెరగని ముద్ర వేశాయి. మన్రో పట్ల బ్రౌన్ కు ఆరాధనా భావం ఏర్పడింది.

## 2.ఉద్యోగ జీవితం

1820 ఆగష్టులో కడపలో బ్రౌన్ ఉద్యోగ జీవితం ప్రారంభమైంది. అప్పటికాయన వయసు ఇరవై రెండేళ్ళు. అప్పట్లో కడప కలెక్టరుకు అసిస్టెంటుగా చేరాడు. అంతకు ఎనిమిదేళ్ళ క్రిందటి వరకు అంటే 1812 దాకా సిద్ధవటం కడప జిల్లా కేంద్రంగా ఉండేది. పాలనా వ్యవహారాలు తెలుగుతో పాటు హిందుస్తానీ, కన్నడం, మరాఠీ భాషల్లో జరుగుతుండేవి. కలెక్టర్ హన్‌బరి తెలుగులో స్వచ్ఛంగా అనర్గళంగా మాట్లాడేవాడు. కలెక్టర్ కంటే మిన్నగా తెలుగు నేర్చుకోవాలన్న పట్టుదలతో బ్రౌన్ రెండేళ్ళలో హన్బరీని మించి పోయాడు కేవలం పుస్తకాల వల్ల తెలుగు రాదని అతని అభిప్రాయం. కోర్టులోని వాదులు, ప్రతివాదులు, నేరస్థులు, పరిచారకులు తనకు ఆ కాలంలో గురువులయ్యారని వ్రాసుకొన్నాడు బ్రౌన్.

తొలిరోజుల్లో అంతటా నిరుత్సాహవాతావరణమే, తెలుగు పండితుల ఛాందసత్వం తెల్లదొరల నిరుత్సాహవాక్యాలు అతనిని వేధించాయి. తెలుగు వ్యాకరణం నిఘంటువు ప్రకటించిన విలియం బ్రౌన్ తెలుగులో సాహిత్యమే లేదన్నాడు. అంతటా అవిద్య తాండవిస్తున్న కాలమది.

సమకాలీనులైన కంపెనీ ఉద్యోగులు ధనార్జనాపరులై అవినీతికి అక్రమాలకు పాల్పడేవారు. తండ్రి సేవా నిరతిని అలవరచుకున్న బ్రౌన్ 1821 లో కడపలో రెండు పాఠశాలలు స్థాపించాడు. ఉచితంగా తెలుగు, హిందుస్తాని పార్శీలలో చదువు చెప్పించాడు. విద్యార్థులకు భోజన వసతి కూడా కల్పించాడు. దేశీయ ఉపాధ్యాయులను నియమించి సొంతపైకంతో ఈ పాఠశాలలను ('ధర్మబళ్ళు') నిర్వహించేవాడు. బ్రౌన్‌కు ఆ తర్వాత బహిః ప్రాణంగా ఉండిన అయోధ్యాపురం కృష్ణారెడ్డి తమ్ముడు నారాయణరెడ్డి ఈ పాఠశాలలోనే తెలుగు, పార్శీ చదువుకొన్నాడు.

1822 అక్టోబర్ 26 న బ్రౌన్ కడప నుంచి మచిలీపట్నం జిల్లాకోర్టు రిజిస్ట్రార్ గా బదలీ అయ్యాడు. వేయి రూపాయల లోపు సివిల్ దావాల విచారణ, సహాయక మేజిస్ట్రేట్ హోదాలో దస్తావేజుల రిజిస్ట్రేషన్ చేసేవాడు. డిసెంబర్ 16 న మచిలీ పట్నం జిల్లాకోర్టులో రిజిస్ట్రార్‌గా ప్రమాణస్వీకారం చేసి పదవీ బాధ్యతలను చేపట్టాడు.

1823 జనవరిలో బందరు జడ్జి చెర్రీని కుంభకోణంకు బదలీ చేశారు. చెర్రీ అనారోగ్యకారణాలవల్ల సెలవులమీద వెళ్ళడంతో రిజిస్ట్రార్ గా వున్న బ్రౌన్ రెండు నెలల పాటు జిల్లా జడ్జిగా పనిచేశాడు.

మొదటినుండీ ముక్కు సూటిగా వ్యవహరిస్తూ వచ్చిన బ్రౌన్, అవినీతి చర్యలను లంచగొండితనాన్ని అణిచివేయాలని నిశ్చయించుకొన్నాడు. మచిలీపట్నం కోర్టు నాజరుతోపాటు

కొందరు ఉద్యోగులను లంచగొండితనం కారణంగా సస్పెండ్ చేశాడు. ఉద్యోగ నిబంధనల లోని లొసగులను బాగా ఆకళించుకొన్న నాజర్ పై అధికారులకు అపీలు పెట్టుకొన్నాడు. సర్కారు వారు బ్రౌన్ ఉత్తర్వులను రద్దుచేశారు.

మచిలీపట్నంలో కూడా బ్రౌన్ రెండు ధర్మబళ్ళను ప్రారంభించాడు. బెంగాలి వ్యాకరణం, సంస్కృతసాహిత్య పఠనం చేశాడు. చాలమంది పండితుల దగ్గర చదివాడు. ఇందులో అగ్రగణ్యుడు వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి. ఈయన సదర్ అదాలత్ (కోర్టు) లో పండితుడు. గుంటూరు జిల్లా కారుమూరు గ్రామానికి చెందినవాడు. బ్రౌన్ ఇతనిని తన గురువుగా, మిత్రునిగా, భాషాసేవకు సహాయకునిగా స్వీకరించి గౌరవించేవాడు.

కొందరు తెల్లదొరలు బ్రౌన్ తెలుగు సాహిత్యాభిరుచిని ఏవగించుకొన్నారు. జారెట్, విలియం బ్రౌన్ మున్నగు వారు తెలుగులో చదవదగిన సాహిత్యమే లేదని వృథాకాలయాపనం అని నిరుత్సాహ పరచారు. దీనికి తోడు దేశీయ పండితుల ఛాందసత్వం, భాషాభేషజం బ్రౌన్‌కు మానసికంగా కొంత బాధ కల్గించింది. బ్రౌన్ స్థిర చిత్తంతో తెలుగు భాషాసాహిత్య అధ్యయనం కొనసాగించాడు. ఆ పట్టుదల వల్లనే తెలుగు సాహిత్య సముద్ధరణ జరిగింది.

1823 జూన్ నెలలో ఆరువారాల పాటు సెలవు పెట్టి మద్రాసు వెళ్ళాడు. పుస్తకాన్వేషణ బ్రౌన్ 'హాబి'. అప్పుడు 'ఆబేదుబాయ్' (1770 - 1848) అనే ఫ్రెంచి మత గురువు వ్రాసిన "హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెరిమనీస్" (హిందువుల ఆచారాలు అలవాట్లు మతకర్మలు) అను పుస్తకం దొరికింది. ఆ పుస్తకంలో వేమన కవి ప్రస్తావన కనిపించింది. తాను పనిచేసిన కడప జిల్లాలో నే ఒక గొప్పకవి ఉన్నాడని తెలుసుకొని ఆనందించాడు బ్రౌన్. ఆబేదుబాయ్ ఆ పుస్తకంలో ఒక చోట "ప్రఖ్యాత కవులలో చాల ప్రాచుర్యం పొందిన కవులలో వేమన ఒకరు. వీరి పద్యాలు తెలుగులో రచించినవే అయినా ఇతర భాషలెన్నిటిలోకో అనువాదమైనవి. ఈ తాత్త్విక కవి రెడ్డి కులానికి చెందినవాడనీ, కడప జిల్లాలో 17 వ శతాబ్ది చివరి పాదంలో జన్మించిన వాడనీ చెప్పుకొంటారు. ఈయన పద్యాలలోని చాల ఉదాహరణలను నేను విన్నాను. అవి వివేకంలోనూ, స్వతంత్రంలోను, శ్రేష్ఠమైనవి" అన్నాడు.

ఇక బ్రౌన్ వేమన పద్యాల సేకరణ కుపక్రమించాడు. మిత్రులు అభిమానుల ద్వారా వివిధ ప్రాంతాలనుంచి వేమన పద్యాలున్న తాటాకు గ్రంథాలను తెప్పించాడు. అల్లిబిల్లిగావున్న పద్యాలను, మత,నీతి, అధిక్షేప, మర్మ విషయాలుగా విభజించి అయిదో భాగాన్ని 'కలగూరగంప' గా విభజించాడు.

డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు, బ్రౌన్ 693 పద్యాలను ఇంగ్లీషులోనిఅనువదించినట్లు పేర్కొనగా, ౨. ఆరుద్రగారు 1215లను అనువదించాడన్నారు. 1824 నాటికి బ్రౌన్ వేమన పద్యాలను ఆంగ్లం చేసి స్వంత ఖర్చుతో ప్రచురించాడు. తిప్పాభట్ల వెంకటశివశాస్త్రి, వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి వేమన పద్యాలకు అర్థతాత్పర్యాలు చెప్పారు. తెలుగు వ్యాకరణ ఛందస్సులను బోధించారు.

బ్రౌన్ 1825 నవంబర్‌లో రాజమండ్రి కలెక్టరుకు హెడ్ అసిస్టెంట్ మేజిస్ట్రేటుగా చేరాడు.

ఆంధ్ర మహాభారతపఠనం ప్రారంభించాడు. కవిజనాశ్రయం, అప్పకవీయం ఆకళించుకొన్నాడు. ఆంధ్ర, గీర్వాణ ఛందోరీతులను వివరిస్తూ ఇంగ్లీషులో ఒక గ్రంథం వ్రాసి డిసెంబర్‌లో కాలేజి బోర్డుకు సమర్పించాడు. కంపెనీ ప్రభుత్వం బ్రౌన్ రచనల ప్రచురణకు సహాయం అందించటానికి సుముఖత చూపలేదు.

రాజమండ్రి హెడ్ అసిస్టెంట్ కలెక్టరుగా ఉన్నప్పుడు 'సాల్ట్‌దరోగా' గవర్రాజు ఉప్పుకొఠార్ల వారినుంచి, ఉప్పు వర్తకులనుంచి లంచాలు గుంజుతున్నాడన్న నేరంపై అతనికి 2 వేల రూపాయల జరిమానా విధించటమే కాక ఉద్యోగంనుంచి బర్తరఫ్ చేశాడు. గవర్రాజు జరిమానా చెల్లించాడు. పై అధికారులకు అపీలు చేసుకొన్నాడు. గవర్రాజు పేరు చెప్పి, సాల్ట్ డిపార్టుమెంటుకు చెందిన గుమాస్తా చిన్నయ్య ఉప్పుకొఠార్ల వారినుంచి డబ్బులు లాగే వాడని తేలింది. ఆ పైకంలో కొంత గవర్రాజు కైంకర్యం చేసేవాడని కూడా తేలింది. గవర్రాజు శిక్ష తప్పించుకొన్నాడు. బ్రౌన్ చేసిన తీర్పు రద్దయింది.

బ్రౌన్ ఆ తర్వాత 1826 మార్చిలో కడపజిల్లా కోర్టు రిజిస్ట్రార్‌గా చేరాడు. కడపకు రావడం అతనికెంతో సంతోషకరమైంది. తాను పెట్టిన ధర్మబళ్ళలో చదువుకొన్నవారు, తనకు పరిచయమున్న వారెందరో ఉన్న ప్రాంతం. తాను సేకరించిన గ్రంథాల పరిష్కరణ శుద్ధ ప్రతుల తయారి మొదలైన పనులకు స్థావరం కావాలని నిశ్చయించాడు.

అందుకోసం కడపలో పెద్ద బంగళా తోట కొన్నాడు. ఆ బంగళాను 1000 వరహాలకు కొన్నట్లు తెలుస్తున్నది. పదిహేను ఎకరాల తోట - చెట్లు చేమలు, సేద్యగాళ్లు ఇలా పెద్ద సంరంభం. ద్రాక్షతోటతో పాటు ఇంకా ఇతర ఫలవృక్షాలుండేవి.

బ్రౌన్ ఎక్కడ పనిచేసినా అతని ఇంటిని 'బ్రౌన్ కాలేజి' అని పిల్చేవారని బ్రౌన్ స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నాడు. ఈరోజుల్లో అయితే ఒక 'యూనివర్సిటీ' అనే వారేమో అన్నాడు పరిశోధకసాహసి బంగోరె. ఆ ఇంటిలో పదిహేను, ఇరవైమంది పండితులతో కలసి అయన 'తెలుగు సాహిత్య సముద్ధరణమహాయజ్ఞం' జరిపిస్తూ ఉండేవాడు. "ఆ బంగళాలో ఒక పక్క స్కూల్, ఒక పక్క తన సొంత గ్రంథాలయం ఏర్పాటు చేసుకొన్నాడు. పండితులకు జీతబత్యాలను బ్రౌన్ సొంత పైకం నుంచి ఇచ్చేవాడు. ఇక్కడే జూలూరి అప్పయ్య వసుచరిత్ర, మనుచరిత్రలకు వ్యాఖ్యలు వ్రాశాడు. పైడిపాటి వెంకటనరసయ్య వేమన పద్యాలను పరిష్కరించేవాడు. కంభం నరసింహాచార్యులు రాఘవ పాండవీయానికి వ్యాఖ్య రూపొందించాడు. బ్రౌన్ ఎక్కడున్నా ఈ బంగళా-తోట తనపేరనే ఉంచుకొన్నాడు. ఈ బంగళా తోటను, అక్కడ సాగే సాహిత్య కృషిని అజమాయిషీ చేస్తూ బ్రౌన్‌కు అత్యంత విశ్వాసపాత్రుడుగా వెలిగిన అయోధ్యాపురం కృష్ణారెడ్డి కూడా స్మరింపదగినవాడు. 1840-44 వరకు ఆ బంగళా-తోట బ్రౌన్ ఆధీనంలో ఉన్నట్లు తెలుస్తుంది. కడపలో బ్రౌన్ అన్న అధ్యాయంలో మరికొన్ని వివరాలు చూడవచ్చు

1829లో మొదటిసారి బ్రౌన్ తెలుగువారికి దూరంగా తిరుచునాపల్లికి ప్రావిన్షియల్ కోర్టు ఆఫ్ అపీల్ అండ్ సర్కిల్ డివిజన్ రిజిస్ట్రారుగా బదలీ అయ్యాడు. తిరుచునాపల్లిలో కూడా తెలుగు పుస్తకాల-అన్వేషణ సాగించాడు. అప్పుడే వేమన పద్యాల గ్రంథం అచ్చయింది. 1829 మే నాటికి 16 వేల పదాల తన నిఘంటువు పూర్తి అయిందని, అచ్చువేయించమని కాలేజి బోర్డుకు

వ్రాసుకొన్నాడు. కాని కాలేజి బోర్డు అందుకు తిరస్కరించింది. డిసెంబర్‌లో అసిస్టెంట్ జడ్జిగా, తర్వాత జాయింట్ క్రిమినల్ జడ్జిగా రాజమండ్రికి బదిలీ అయ్యాడు.

అప్పట్లో యవ్వనదశలో ఉన్న బ్రౌన్ వేట వినోదాలలో కూడా ఆసక్తి చూపాడు. 1830 లో మచిలీపట్నం అప్పిలేట్ కోర్టు జడ్జిగా చేరాడు. బ్రేడ్ గురించిన వ్యాసం వ్రాశాడు. అందులో హిందువులకు కావలసిన ముఖ్యసరకుల గురించి వ్రాశాడు. ఏడేళ్ళుగా తదేక దీక్షతో వ్రాస్తూ వచ్చిన తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువుకు సమగ్ర రూపమిచ్చాడు. దీనినే తిరగరాసి ఇంగ్లీష్ తెలుగు నిఘంటువుగా తయారుచేయ టానికి పూనుకొన్నడు. శ్యామ్యుయల్ జాన్సన్ ఇంగ్లీష్ నిఘంటువును తెలుగులో తర్జుమాచేయ నారంభించాడు. ఇక్కడున్నప్పుడే ఏనుగుల వీరాస్వామయ్య కాశీ యాత్ర నుంచి తిరిగి వస్తూ 1830 ఆగష్టు 2-15 తేదీల మధ్య మచిలీపట్నంలో బ్రౌన్‌ను కలుసుకొన్నాడు.

1832 లో గుంటూరు ఆక్టింగ్ కలెక్టర్‌గా పదవిలో చేరాడు. గుంటూరులో భీకరమైన కరువు తాండవ మాడుతున్న కాలమది. ఆకలిచావులను రోజూ వింటూ వచ్చాడు. బీదలిచ్చే అర్జీలు గుట్టలుగా పెరిగాయి. ఘోరమైన ఆ కాటకం గుంటూరు కరువుగా పేరుగాంచింది. లూటీలు, దొంగతనాలు పెచ్చరిల్లాయి. పోలీసులకు కావలసిన మందుగుండు సామాన్లను సరఫరా చేయమని గవర్నరుకు వ్రాశాడు. ధాన్యం ధరల పెరుగుదలను గురించి ఆకలి చావుల గురించి సవివరమైన నివేదికను గవర్నర్‌కు పంపాడు. కడపలో కరువు పరిస్థితులు, బీదల స్థితిగతులు గురించి జాబు వ్రాయమని అయోధ్యాపురం కృష్ణారెడ్డిని కోరాడు.

చీఫ్ సెక్రటరికి, బ్రౌన్ నివేదికలలోని పదజాలం నచ్చలేదు. కరువు అనే పదం ఎందుకు వాడావు? కొరత అని వ్రాయవచ్చు కదా? అని మందలిస్తూ సంజాయిషి కోరాడు. గుంటూరులో ధరలను తెలుపమన్నాడు. ధరల పట్టీ పంపాడు. ఉప్పు తప్ప తక్కిన వాటి ధరలన్నీ రెట్టింపు పెరిగినట్లు స్పష్టమైంది. పరిస్థితులు విషమించడంతో గంజి కేంద్రాలు ప్రారంభించి కరుపు పనులు ఏర్పాటు చేయటం జరిగింది.

1831-32 లో గుంటూరు జిల్లా జనాభా 5,12,316 కాగా 1832 - 33 లో 3,57,038 కి దిగిపోయింది. ఆ మరుసటి సంవత్సరం మరో లక్షా ఇరువైవేల మంది తగ్గిపోయారు. ఈ కరువు పొట్టన పెట్టుకొన్న మనుషుల శవాలను రోడ్డుకు రెండు ప్రక్కలా పేర్చితే ఆ పొడవు 20 మైళ్ళు వుంటుందని అంచనా వేశారు. పాడి పశువులు, గొర్రెలు, మేకలు, ఈ రెండేళ్ళలో మొత్తం 6 లక్షలకు పైగా మలమల మాడి పోయాయి. ("బ్రౌన్ జాబులు - స్థానిక చరిత్ర శకలాలు"- బంగోరె 'కరువు కటకటలు' - పుట 42)

గుంటూరు నుంచి చిత్తూరుకు - ఆ తర్వాత స్వల్పకాలం లోనే మరల మచిలీపట్నంకు బదిలీ చేశారు. అప్పుడు మచిలీపట్నంలో తెలుగు ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభించాడు. దాని ప్రెస్ అజ్మాయిషీకి నియమింపబడిన ఆంగ్లేయుడే మోసం చేసేసరికి ప్రెస్‌ను అమ్మివేశాడు. ఇంతలో అయనకు కొన్ని సమస్యలు ఎదురైనాయి.

ఇదివరలో రాజమండ్రి అసిస్టెంట్ జడ్జిగా ఉన్నప్పుడు సరస తీర్పులు ఇచ్చాడని బ్రౌన్ పై అర్జీలు కొందరు అధికారులకు పంపారు. బ్రౌన్ ఆ కేసుల విచారణలో పక్షపాతంగా

వ్యవహారించాడని న్యాయశాస్త్ర నిబంధనలను విస్మరించాడన్న కారణంతో 1834 అక్టోబర్ లో కంపెనీ బోర్డు బ్రౌన్‌ను డిస్మిస్ చేసింది.

బ్రౌన్ పై అధికారులకు సమాధానం పంపుతూ కొన్ని తప్పులు దొర్లినమాట వాస్తవమే కాని అందు తనకే దురుద్దేశం లేదనీ నిష్పాక్షికంగా తన విధులను నిర్వహించానని తన నడవడికనూ, శీలాన్ని, క్షుణ్ణంగా విచారణ జరుపమనీ వ్రాసుకొన్నాడు. విధి నిర్వహణలో శీలం గురించి పేర్కొనటం అనవసరమంటూ డిస్మిసల్ ఉత్తరువులను ధ్రువపరిచారు. వెంటనే ఛార్జి ఇచ్చి వెళ్ళమన్నారు. ఎటువంటి అలవెన్సులు ఇవ్వమన్నారు. లండన్ లోని కోర్టు ఆఫ్ డైరక్టర్స్ కు అపీలు చేసుకొన్నాడు. బ్రౌన్ మూడేళ్ల సెలవుపై ఏడాదికి 500 పౌండ్ల జీతంతో లండన్ వెళ్ళాడు. లండన్‌కు పోతూ డబ్బు ఇబ్బంది వల్ల తన గ్రంథాలయంలోని కొన్ని ఇంగ్లీష్ పుస్తకాలను అమ్ముకొన్నాడు.

లండన్‌లో తన అపీలుకు సంబంధించిన ముఖ్యులను కలుసుకొని తన సంగతులను చెప్పుకొన్నాడు. అప్పటికి కొన్ని షరతులతో బ్రౌన్ డిస్మిసల్ రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీ చేశారు.

లండన్ లో సెలవులలో ఉన్నా తాను వ్రాసి పెట్టుకొన్న నిఘంటువు శుద్ధ ప్రతిని తయారుచేశాడు. తెలుగు వ్యాకరణం వ్రాయటానికి పూనుకొన్నాడు.

రాయల్ ఏషియాటిక్ సొసైటి కి బ్రౌన్ రెండు వర్ణ చిత్రాలు బహూకరించాడు. ఒకటి గోదావరి దగ్గర కోటిపల్లిలో నృత్య భంగిమలో ఉన్న వినాయక శిల్పానికి చిత్రాకృతి, మరొకటి కులీన తెలుగు మహిళ చిత్రం.

ప్రొఫెసర్ "రోసెన్" అభ్యర్థనపై సంస్కృత ఛందస్సును గురించి పెద్ద వ్యాసం ఇంగ్లీష్ లో వ్రాశాడు. ప్రొఫెసర్ విల్సన్ కోరిక మేరకు ఇండియా హౌస్ లైబ్రరీ లో ఒక మూలపడి వున్న తెలుగు, కన్నడ, సంస్కృత వ్రాత ప్రతులను పరిశీలించి వాటి కేటలాగ్ తయారు చేశాడు. ఈ సేవను మెచ్చుకొన్న కోర్టు ఆఫ్ డైరక్టర్స్ బ్రౌన్‌కు తమ అభినందనలు తెలిపారు.

1837 అగష్టులో బ్రౌన్ లండన్ నుంచి ఇండియాకు బయలుదేరాడు. ఓడలో సహప్రయాణీకునిగా రాబర్ట్ కాల్డ్వెల్ కూడా ఉన్నాడు. ఈయనే తర్వాత బిషప్ కాల్డ్‌వెల్ అయ్యాడు. పరస్పర పరిచయం స్నేహంగా మారింది. బ్రౌన్, కాల్డ్వెల్‌కు సంస్కృతం నేర్పేటట్లు మాట ఇచ్చాడు. 20 ఏళ్ళ తర్వాత బిషప్ కాల్డ్వెల్ తమిళం తెలుగు వగైరా ద్రావిడ భాషలు సంస్కృత జన్యం కావని స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన భాషా కుటుంబానికి చెందినవని నిరూపిస్తూ పెద్ద పరిశోధనా గ్రంథాన్ని వ్రాశాడు.

నౌకా యానంలో ఏర్పడిన స్నేహాన్ని పురస్కరించుకొని కాల్డ్వెల్ బ్రౌన్‌ను గురించిన కొన్ని సత్యాంశాలను నిర్మొహమాటంగా పేర్కొని అతని వ్యక్తిత్వంలోని లోపాలను కూడా ఎత్తిచూపాడు. ఇంగ్లండు నుంచి తిరిగి వచ్చిన బ్రౌన్‌ను 1838 జనవరిలో పార్సీ అనువాదకుడిగా నెలకురూ 400 వేతనంపై నియమించారు సర్కారు వారు. అనువాద రూపంలో అతడు చాలా రచనలు చేశాడు. ఆకాలంలోనే బ్రౌన్ ను కాలేజి బోర్డు గౌరవ సభ్యునిగా నియమించారు. ఈ కాలేజి బోర్డు

వ్యవహారమంతా పైన పటారం లోన లొటారం అన్నాడు. బ్రౌన్ తెల్లదొరల లోపాలను ఎత్తిచూపాడు. బోర్డులు ఒక్కొక్కప్పుడు తెరలే ! అడ్డుగోడలే ! అన్నాడు. బ్రౌన్ ఆ బోర్డును సంస్కరించ లేక పోయాడు.

పరీక్షకు కూర్చునే విద్యార్థులను బ్రౌన్ తన ఇంటికి పిలిచి వారికి తగిన సహాయం చేసేవాడు. వారి సంశయాలను తీర్చేవాడు.

తెల్లవారితో పాటు తెలుగు వారైన పండితులు కూడా బోర్డు సమావేశాలకు హాజరయ్యే వారు బోర్డు సభ్యులు కొందరు జాత్యహంకారంతో తెలుగు వారిని చిన్న చూపుచూచేవారు. కాని బ్రౌన్ తెలుగు పండితులు కూడా తనతోపాటు బోర్డులో గౌరవప్రదంగా కూర్చోడానికి వీలు కల్పించాడు. ఆ నాటికి అదొక గొప్ప మార్పు. బ్రౌన్ సౌజన్య సౌహార్ద్రాలకు అదొక నిదర్శనం.

1841 లో మద్రాసు అక్టింగ్ పోస్ట్‌మాస్టర్ జనరల్‌గాను ఆ తర్వాత మద్రాసు యూనివర్సిటీ బోర్డు సభ్యుడు గాను మద్రాసు బ్యాంక్ డైరెక్టర్‌గాను మద్రాసు కాలేజి లిఖిత పుస్తకాల గ్రంథాలయానికి క్యూరేటర్‌గాను పనిచేశాడు. ఆర్.కోల్‌తో పాటు మద్రాసు లిటరరీ జర్నల్ సంయుక్త సంపాదకుడుగ చాలా సంవత్సరాలు పనిచేశాడు. ప్రభుత్వోద్యోగిగా తెలుగు హిందుస్తానీ భాషలనుంచి ఇంగ్లీష్‌లోకి, ఇంగ్లీష్ నుంచి ఆ భాషలలోకి ఎన్నో అనువాదాలు చేశాడు.

1845 లో మద్రాసు లిటరరీ సొసైటీ వారికి తన సొంత గ్రంథాలయం నుంచి దేశ భాషలలోని 2440 వ్రాత ప్రతులను బహూకరించాడు. అప్పట్లో వాటి విలువ ఎంత లేదన్నా ముప్పదివేల రూపాయలుంటుందని బ్రౌన్ అంచనా. అంతేకాక వాటిని కేటలాగింగ్ చేయటానికి ముగ్గురు పండితులను సొంత పైకంతో నియమించాడు. ఈ విధంగా బ్రౌన్ ఇచ్చిన గ్రంథాలే నేటి మద్రాస్ ఓరియంటల్ మేన్యుస్క్రిప్ట్ లైబ్రరీ కి మూలకందాలు.

చరిత్రకు సంబంధించిన వ్రాత ప్రతులనెన్నింటినో బ్రౌన్ సేకరించాడు. మద్రాసు కాలేజిలోను లండన్ నుంచి వచ్చిన వ్రాత ప్రతులలోను ఉన్న మెకంజీ కైఫియత్తులను సేకరించి శిథిలమవుతున్న వేలాది కైఫియత్తులను దళసరి కాగితాలపై శుద్ధ ప్రతులు, సొంతె పైకంతో కాపీ చేయించి చరిత్ర రచన కెంతగానో తోడ్పడ్డాడు.

1842 లో లండన్ కోర్టు ఆఫ్ డైరెక్టర్స్ వారి ఉత్తర్వుల మేరకు మద్రాసు రాష్ట్రానికి సంబంధించిన జ్యుడిషియల్, రెవెన్యూ పదజాలాన్ని సేకరించాడు. వేలాది పదాలను సేకరించి అర్థాలతో పంపాడు. ఈ అనుభవంతోనే బ్రౌన్ జిల్లా డిక్షనరీని ప్రచురించాడు.

అత్యంత దక్షతతో నిర్విరామంగా పనిచేస్తున్న బ్రౌన్ 1853 లో పక్షవాత వ్యాధి కారణంగా సెలవు పెట్టి నీలగిరి కొండలకు వెళ్ళాడు. ఉదకమండలంలో ఒక క్రైస్తవ కుటుంబం వారికి అతిథిగా ఉండేవాడు. అక్కడే రెవరెండ్ బెర్నార్డ్ ష్మిడ్ తో పరిచయమేర్పడింది. ఆరోగ్యం కుదట పడింది. మిత్రుల కోరికపై మన దేశం వదలిపోవటానికి ముందు తన సాహిత్య వ్యాసంగానికి సంబంధించిన రచన సంగ్రహంగా వ్రాశాడు. కాని దానిని బయట పెట్టలేదు. ఆరోగ్యం చక్కపడిన తర్వాత బ్రౌన్ బెంగుళూరు, శ్రీరంగపట్నం, మైసూరు మొదలైన నగరాలను చూశాడు. రాను రాను

సరళమైన జీవితం అలవరచుకొంటూ వచ్చాడు. సరిగా నిద్ర పట్టేది కాదతనికి. యాభై యో ఏట కూడ కళ్ళద్దాలు లేకుండా చదువ కలిగే వాడు.ఆరోగ్య స్థితిని తెలుసుకొన్న బ్రౌన్ సోదరీమణులు అతనిని లండన్‌కు తిరిగి రావలసినదిగా ఒత్తిడి చేశారు. వైద్యులు కూడా ఇంగ్లండుకు పోవటం మంచిదన్నారు.

1854 మే 1 వ తేదిన స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశాడు. అయనకు సంవత్సరానికి 920 పౌండ్ల ఫింఛన్ మంజూరైంది. యూరోపియన్ సారస్వత గ్రంధాలు దాదాపు 5 వేలు అమ్మకానికి పెట్టాడు. చాల తక్కువ వెలకు అమ్మవలసి వచ్చింది. హీబ్రూ, గ్రీక్, ఇంకా ఇతర భాషల్లోని గ్రంధాలను మద్రాసు బైబిల్ సొసైటీకి బహూకరించాడు.

1817 నుంచి 1834 వరకు 17 ఏళ్ళు 1838 నుండి 1855 దాకా మరో 17 ఏళ్ళు మొత్తం 34 ఏళ్ళు ఇండియన్ సివిల్ ఉద్యోగిగా, ఇంపీరియలిస్ట్ ప్రతినిధిగా తెలుగు ప్రజల మధ్య నివసించి, తెలుగు సాహిత్య సముద్ధరణకు సర్వశక్తులను వినియోగించిన బ్రౌన్ 1855 మే, జూన్‌లో లండన్‌కు వెళ్ళిపోయాడు. మరల తిరిగిరాలేదు.

## 3. లండన్ జీవితం

ఉద్యోగ విరమణ చేసిన బ్రౌన్ లండన్‌లో స్థిర నివాసం ఏర్పాటు చేసుకొన్నాడు. అతని ఇల్లు (22, కిల్డార్ గార్డెన్స్ వెస్ట్ బర్న్ గ్రోవ్, డబ్లు) ప్రాచ్యభాషా విద్వాంసులకు , భారతీయ భాషలను గురించి ముఖ్యంగా తెలుగును గురించి తెలుసుకోదలచిన వారికి కేంద్రంగా ఉండేది. ఇక అప్పుడాయనకు అభిమాన పాత్రమైన యూరోప్ చరిత్రను అధ్యయనం చేశాడు. తత్వ శాస్త్రగ్రంథములెన్నిటినో సేకరించాడు.

బ్రౌన్ ఉత్తమ పరిశోధకుడికి ఉండవలసిన రెండు లక్షణాలను బాగా అలవరచుకొన్నాడు. వ్రాసిన దానిని సోపపత్తికంగా నిరూపించటం, అవశ్యకత లేనిదే వ్రాసినది అచ్చువేయకుండ ఉండటం అతని సహజ గుణాలు.

అయన లండన్‌లో కూడా విశ్రాంతి నెరుగని భాషాసేవ సాగించాడు. 1857 తొలిపాదం లో తన తెలుగు వ్యాకరణం ద్వితీయ ముద్రణకు పీఠిక వ్రాయించి పంపాడు. 1860 లో మళ్ళీ తెలుగు పుస్తకాల ద్వారా తెలుగు సాహిత్యంలో వస్తున్న ధోరణులను తెలుసుకొంటూ ఉండేవాడు. ఆ కాలంలోనే ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం తర్వాత భారతదేశం స్థితిగతులను లేఖల ద్వారా తెలుసుకొని పన్నెండు పట్టణాలలో భారతదేశాన్ని గురించి ఉపన్యాసాలిచ్చాడు.

1863 లో కర్నాటక్ క్రానాలజి ప్రచురించాడు. 1865 లో లండన్ యూనివర్సిటీ లో తెలుగు ప్రొఫెసర్ అయ్యాడు. 1866 లోను 1872 లోను రెండుసార్లు తన సాహిత్యజీవిత చరిత్రను లండన్‌లో అచ్చు వేయించాడు. 1866 నాటి ప్రచురణను మరికొంత సవరించి పెంచి ముద్రించాడు.ఎవరైనా భాషాసాహిత్యపరమైన సంశయాల నివారణ కోరుతూ తనకు వ్రాసిన జాబులన్నిటికీ సమాధానాలు వ్రాస్తుండేవాడు. రాయల్ ఏషియాటిక్ సొసైటి (లండన్) పత్రికలో అతని వ్యాసాలు వస్తుండేవి. 1837 లో తాను వ్రాసిన సంస్కృత ఛందస్సు అనే చిన్న పుస్తకాన్ని ప్రచురించాడు.

తాను సిద్ధంచేసి అచ్చు వేయించిన నిఘంటువులను ఇంటర్ లీవ్ చేసిన కాపీలను తిరగేస్తూ ఎన్నో చేర్పులు, కొద్ది మార్పులు చేస్తూ వచ్చాడు. ఈ విధంగా సిద్ధమైన నిఘంటువులకు ఇచ్చిన ప్రయోగాలను, తాను అచ్చు వేయించిన కావ్యాల నుంచి తీసుకొనేవాడు. తన వ్యాకరణాన్ని మళ్ళీ సవరించాడు. డా॥ జాన్సన్ వలె తాను కూడా బ్రతికినంత కాలం చేర్పులు, మార్పులు చేస్తూ పోయానన్నాడు.

లోగడ తాను కడపలో పనిచేస్తున్నప్పుడు ఒక మంత్రగాడు తంత్రశక్తులకోసం వినియోగించిన మంత్ర తంత్రాలను ఇంగ్లీష్‌లోకి అనువదించి 'తెలుగు స్పెల్స్' అన్న శీర్షికతో మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్సులో (1864 జూలై) ప్రకటించాడు. 1869 లో ఐ.సి.యస్ పరీక్షలకు తెలుగు ఎగ్జామినర్‌గా పనిచేశాడు. మిరియంబి అనే 16 ఏళ్ళ అమ్మాయికి సంస్కృతం, బెంగాలి నేర్పాడు.

వృద్ధాప్యం ముంచుకొని రాగా 1884 నవంబర్ 3వ తేదిన బ్రౌను వీలునామా వ్రాశాడు. అప్పటికాతని వయసు 86 ఏళ్ళు. వీలునామాలో కూడా పుస్తకాల గొడవే.

తెలుగు, సంస్కృతం మొదలైన ప్రాచ్యభాషా గ్రంథాలు, ముద్రిత, అముద్రిత రచనలు, గ్రంథాలు అన్నిటిని ఇండియా ఆఫీసు లైబ్రరీకి చెందేటట్లు కోరాడు. ఖర్చుల క్రింద 10 పౌన్లు ఇవ్వాలన్నాడు.

24 ఏళ్ళు తనకు సేవ చేసిన సారానాట్‌కు 250 పౌన్లు, ఇంటి సామాన్లు, వస్త్రాలు, చిత్రపటాలు చెందేట్లు, మరో సేవకురాలు ఎమ్మాఅగెర్‌కు 25 పౌన్లు, యాన్ హెన్రిటా షర్మెన్ అనే మహిళకు 200 పౌన్లు, ఆమె సోదరి ఆగ్నేస్ లెయింగ్‌కు 100 పౌండ్లు, మిస్ మెటిల్డా కాన్‌ట్లీ అను ఆమెకు 50 గినీలు, ఇంకా మిగిలిన దానిని షెర్మన్ - లెయింగ్ లకు చెందేట్లు వ్రాశాడు.

తనకు రావలసిన బాకీలన్నిటిని రద్దు చేశాడు. తన వీలునామా ద్వారా సంక్రమించిన ఆస్తులు ఆయా స్త్రీలందర్నీ భర్తల ప్రమేయం లేకుండా అనుభవించ వచ్చునన్నాడు.

తన సోదరుడైన జేమ్స్ కొలే బ్రౌన్ కుమారుడు జార్జికేలే బ్రౌన్‌ను ఎక్జిక్యూటివ్ ట్రస్టీగా నియమించాడు. అందుకయ్యే ఖర్చుల క్రింద 70 పౌన్లు వ్రాశాడు. తన మేనల్లుడు కొలే బ్రౌన్‌కు మాత్రం తన గ్రంథాలయం నుంచి అతని కిష్టమైన వంద పుస్తకాలను తీసుకోవచ్చుననీ మిగతవన్నీ ఇండియా ఆఫీస్ లైబ్రరీకి చెందాలనీ వ్రాశాడు.

చివరి రోజుల్లో లండన్ ఎథీనియం పత్రికకు చెందిన ఆర్. ఎం. మాగ్డనాల్డ్ బ్రౌన్‌ను కలుసుకొన్నప్పుడు - పుస్తకాల ముద్రణకు ఖర్చుపెట్టిన పైకంలో - తనకు వచ్చిన రాబడి 15 వ వంతు మాత్రమే అని చెప్పాడు. తెలుగు భాషా సాహిత్యాల సముద్ధరణకు అనన్యంగా, అపూర్వంగా సేవచేసిన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తన యనభై ఏడవ ఏట 1884 డిసెంబర్ 12న దివంగతుడయ్యాడు.

## 4. గ్రంథ సేకరణ-పరిష్కరణ

ఆంధ్ర మహారాజులు, రాజులు, సామంతులు, జమీందారులు కవులను పోషించి కావ్య సృష్టి కెంతగానో తోడ్పడినారు. కాలక్రమంలో యుద్ధాలు, ఇతర ఉపద్రవాల కారణంగా కొన్ని కావ్యాలు ఇతర గ్రంథాలు నాశనమైనాయి. ముద్రణాది సౌకార్యాలు లేని కాలమది. తాళపత్ర గ్రంథాలు క్రిమిదష్టం కావటం సహజం. ఈ విధంగా అమూల్య గ్రంథాలెన్నో అగ్నిపురుగుల కాహారమై పోయాయి. అటువంటి స్థితిలో ఆంధ్ర మహాకావ్యాల సముద్ధరణకు పూనుకొని పెక్కు గ్రంథాలను సేకరించి పరిష్కరింప చేసిన సాహిత్య స్థాపనాచార్యుడు బ్రౌన్.

ప్రాచీన భారతీయ విద్యా విధానం శ్రుతిరూపంగా ఉండేది. గురువులు బోధించినదంతా శిష్యుల మస్తిష్కాలలోనే వుండేది. ముఖస్థమైన వాఙ్మయం తాళపత్రముల పైకెక్కినప్పుడు మూలానికి భిన్నమైన పాఠాంతరా లేర్పడేవి. గురువుల ప్రవచనంలోని భేదముల వల్ల లేఖక ప్రమాదాల వల్ల గ్రంథ పాఠం కారణంగా పాఠాంతరాలు పుట్టేవి.

వివిధ పాఠాలను పరిశీలించి పండితులను, లేఖకులను, వ్రాత ప్రతుల సేకరించేవారిని సొంత పైకంతో నియమించి, విభిన్న పాఠాలలో గల వైరుధ్యాలను పరిష్కరింపచేసి పద్య సంఖ్యలను, ఆశ్వాసాలను విభజింప జేసి ప్రామాణికమైన శుద్ధ ప్రతులను సిద్ధపరచి తెలుగు పండితులకు గ్రంథ పరిష్కరణలో మార్గదర్శకుడైన సాహిత్య సమారాధకుడు బ్రౌన్.

"In 1825 I found Telugu Literature dead. In thirty years I raised it to life" అని బ్రౌన్ అన్న మాటల్లో అతిశయోక్తి లేదు. ఇట్లా పందొమ్మిదో శతాబ్ది తొలిపాదం లో ప్రవేశించేటప్పటికి "తెలుగు సాహిత్యక్షేత్రం జనవాటికకు దూరంగా వొక శిథిలభవన సముదాయంగా తయారైంది".

"మృతప్రాయమైన ఆ దశలో నుంచి మళ్ళీ జీవశక్తిని పుంజుకొని ప్రాణస్ఫూర్తిని పొందటానికి క్రొత్త శక్తులు అవసరమయ్యాయి. బ్రౌన్ యుగావతరణ జరిగింది. సరిగ్గా ఆ తరుణంలోనే శిథిలప్రాకార ప్రాంగణంలో అడ్డదిడ్డంగా మొలచిన గంజాయి మొక్కలన్నీ పీకేసి, క్రొత్త పాదులన్నీ తీసి, క్రొత్త పాయలన్నీ పారించి వొక సుందరమైన ఆరామంగా తీర్చిదిద్దడానికి బ్రౌన్‌కు నిజంగా మూడు దశాబ్దాలు పట్టింది. ఖర్చుకు గిర్చుకు వెనకాడకుండా వొక కఠోరమైన దీక్షతో ఎంత శ్రమ పడాల్నో అంతా పడ్డాడు. ఇందుకు వొక ప్రత్యక్ష సాక్ష్యం కడపలో యేర్పాటు చేసిన యీ సాహిత్య కర్మాగారం (బ్రౌన్ జాబుల్లోస్థానిక చరిత్ర శకలాలు - కడప జాబుల సంకలనం - బంగోరె - పుట 70 -71)

పండితులు, వ్రాయసగాండ్రు గ్రామాలలో తిరుగుతూ గ్రంథములను సేకరించారు. ఈ రీతిగా సేకరించిన గ్రంథాలను పండితుల పరిష్కరణకు అప్పగించాడు. ఒక్కొక్క కావ్యానికి ఒకటికి మించిన ప్రతులు - కొన్నింటికి పదిపన్నెండు వరకు సేకరించాడు. ఆ కాలంలో గ్రంథ సేకరణ అతివ్యయప్రయాసలతో కూడిన వ్యాసంగం. ప్రజల్లో మూఢవిశ్వాసాలు గట్టిగా వుండినందున వారు తమ వద్ద ఉన్న తాళ పత్ర గ్రంథాలను సులభంగా ఇచ్చేవారు కారు. 1830 లో మచిలీపట్నంలోని కోటి వెంకన్న భార్య వద్ద నున్న వారి పుస్తక భాండాగారమును 370

రూపాయలకు కొన్నాడు. అందులో ప్రధానంగా సంస్కృత గ్రంథాలు కొన్ని తెలుగు గ్రంథాలు ఉండేవి.

1834 లో యానాం వాసియైన మాజేటి సర్వేశలింగం గ్రంథాలయాన్ని 150 రూపాయలకు కొన్నాడు. మొత్తం 613 గ్రంథాలలో 386 సంస్కృత గ్రంథాలు. వీటిలో తాంత్రిక వైద్య వ్యాకరణాది గ్రంథాలుండేవి.

పెద్దాపురంలోని అవసరాల వేంకట్రావు గ్రంథాలయాన్ని రూ.796 లకు కొన్నాడు. ఇందులో ప్రధానమైన సంస్కృత కావ్యాలుండేవి.

రాజమండ్రిలోని ఒక న్యాయవాది నుంచి కొన్ని గ్రంథాలను కొన్నాడు. తాను కొన్న గ్రంథములకు తాను ఇచ్చిన వెల అత్యల్పమన్నాడు. బ్రౌన్‌కు గల జ్ఞాన తృష్ణకు ఇంతకంటే మరే నిదర్శనం కావాలి.

తాళపత్ర ప్రతులున్నవని తెలిసిన ఏ వ్యక్తితోనైనా స్నేహం పెంచుకొనేవాడు. వారి మాతృభాషలోనే సంభాషణ జరిపేవాడు. తన ఆంగ్ల పుస్తకాలను వారికి చదవటానికి ఇచ్చేవాడు. ఆ రీతిగా పరస్పర మైత్రిని సంపాదించాడు.

తాటాకు వ్రాతలో ఉన్న ఛందోభంగాలను గణయతి ప్రాస దోషాలను సవరించ గల ఛందః పరిజ్ఞానం కల లేఖకులను మాత్రమే ఆ పనికి వినియోగించేవాడు. కాగితాలను సమ భాగాలుగా కత్తిరించి వరుస తప్పకుండటానికి గీతలు గీసి వ్రాయసగాండ్రకిచ్చేవాడు. ఈ విధంగా అతి చిన్న విషయాల పట్ల క్రమతను పాటించేవాడు.

కాగితపు ప్రతి తయారైన తర్వాత ఆ కావ్యం యొక్క ఇతర ప్రతులను ఏడు లేదా ఎనిమిదింటిని సేకరించి సమర్థులైన పండితులు ముగ్గురు లేదా నలుగురికి ఆ ప్రతులను ఇచ్చేవాడు. పండితులు వలయాకారంలో కూర్చొని తమ ప్రతులలోని పద్యాలు చదువుతుండగా లేఖకుడు వ్రాసేవాడు. ఒక కావ్యానికి సంపూర్ణంగా పాఠాంతరాలను సరిపోల్చిన తర్వాత దానిని పుస్తకంగా కుట్టించేవాడు.

పాఠాలను పఠించే వారందరూ పండితులే కాకూడదని బ్రౌన్ అభిప్రాయం. వారిలో ఒకడు విద్వాంసుడైన చాలు. అందరూ పండితులైతే శుద్ధపాఠ నిర్ణయంలో కాలయాపన జరుగుతుందని ఆయన నమ్మకం.

పాఠాలలో భిన్నతను గుర్తించకపోతే అర్ధరూపాయి లేదా పావలా జరిమానా విధించేవాడు ఎటువంటి అశ్రద్ధనూ సహించేవాడు కాడు.

నిర్విరామంగా నిర్ణీతకాలములోనే పనిచేయటం ఏకాగ్రతకు భంగకరమన్నాడు. నిర్ణీత కాలమున్నప్పటికీ కొంచెం ముందు వెనుకవచ్చినప్పటికీ బ్రౌన్ కల్పించుకొనేవాడు కాడు. వ్యక్తి నిజాయితీని గుర్తించేవాడు. ప్రతుల సేకరణ, కాగిత ప్రతుల తయారీ, సవరణ, పరిష్కరణ, శుద్ధ

ప్రతుల తయారీ మొదలైన పనుల్లో ఇటలీ, జర్మనీ దేశస్థుల విధానాలను అనుసరించాడు. అదే శాస్త్రీయ పద్ధతి. నేటికీ ఆ విధానమే అనుసరించబడుతున్నది.

లేఖకులకు బ్రౌన్ నిర్ణయించిన కూలీ డబ్బులు కుతూహలం కల్గిస్తాయి. ఒక రూపాయికి 200 పద్యాలు అంటే 800 పాదాలు వ్రాయాలి. నెల జీతాలిస్తే అశ్రద్ధ, అజాగ్రత్త ఏర్పడతాయని దినసరి లెక్క ప్రకారం చెల్లించేవాడు.

శాస్త్రులకు పండితులకు నెలకు 15 రూపాయలిచ్చేవాడు. తమ కుటుంబీకులను వదలి ఇతర చోట్లకు పోయి పని చేసే వారికి కొంత అదనపు వేతనం ఇచ్చేవాడు. వెయ్యి తెలుగు పద్యాలకు 5 రూపాయలు చొప్పున, వెయ్యి సంస్కృత శ్లోకాలకు 6 రూపాయలు చొప్పున ఇచ్చేవాడు. ఇది కాశీలో లేఖకులకు ఇచ్చే వేతనం, ఎక్కువ జీతమిస్తే అశ్రద్ధకు దారి తీస్తుందనీ తక్కువ ఇస్తే పండితులు సమారాధనలకు వెళ్ళిపోతారని బ్రౌన్ అభిప్రాయం.

విభిన్నతాళ పత్రాలను పరిష్కరించి శుద్ధ ప్రామాణిక ప్రతులను సిద్ధపరచటానికి ఆద్యుడు బ్రౌన్, అందువల్లనే ఆయన 'ఆంధ్రభాషావన పునరున్మీలన మధుమాస వసంతుడు'. అని ప్రస్తుతింపబడినాడు.

బ్రౌన్ 36 పురాణేతిహాసాలను సేకరించినట్లు తెలుస్తున్నది. కాశీఖండము, పద్మపురాణము భాగవతము, భారతము, భాస్కర రామాయణము, విష్ణుపురాణము, శ్రీ కాళహస్తి మాహాత్మ్యము ల పాఠనిర్ణయం చేయించి శుద్ధప్రతులు వ్రాయించాడు. మహాభారత శుద్ధ ప్రతి తయారీకి రు. 2714 రూపాయల ఖర్చు చేశాడు. సిద్ధమైన అనేక గ్రంథాలను అచ్చువేసు కొంటామను అన్న వారికి ఇచ్చేవాడు. మద్రాసు విశ్వవిద్యాలయములో ద్వితీయ పండితుడిగా ఉండిన పురాణం హయగ్రీవ శాస్త్రి గారి విన్నపం మేరకు బ్రౌన్ తాను పరిష్కరింపజేసిన ఆంధ్ర మహాభాగవతాన్ని హయగ్రీవ శాస్త్రులు తన వివేకాదర్శ ముద్రణాలయంలో 1848 లో ముద్రించాడు. ఈ భాగవత పీఠికలో కడప దగ్గర ఉన్న ఒంటిమిట్టయే ఏకశిలానగరమని ఆయన వ్రాశాడని బ్రౌన్ తన నిఘంటువు నకు వ్రాసిన ఒక నోట్‌లో వివరించాడు. (సి.పి.బ్రౌన్ – డా. కొత్తపల్లి వీరభద్రరావు పుట 163, 164)

ఈ పురాణేతిహాసాల అధ్యయనంలోను పరిష్కరణంలోను, బ్రౌన్ ఆంధ్ర కవులను గ్రీక్, ఆంగ్ల కవులతో పోల్చి తారతమ్యాలను చూపేవాడు. తనకు నచ్చిన కొన్ని పద్యాలను ఇంగ్లీష్ లోకి అనువాదం చేసేవాడు.

ధూర్జటి శ్రీకాళహస్తి మాహాత్మ్యానికి బ్రౌన్ ఇంగ్లీష్‌లో కథాసంగ్రహాన్ని సమకూర్చాడు. బ్రౌన్ ప్రజాసామాన్యానికి సాహిత్యం అందుబాటులో ఉండవలెనని ఆశించాడు. అందువల్లనే సులభశైలిలో పురాణాలను ముందుగా పరిష్కరింప జేసి ముద్రించాడు. పండితులకు ఆదరణీయాలైన ప్రబంధాలను తర్వాత తీసుకొన్నాడు. ఆంధ్రులకు అత్యంత ప్రీతి పాత్రమైన మనుచరిత్ర వసుచరిత్రలను మొట్టమొదట వ్యాఖ్యానాలతో పాటు అచ్చువేయించిన కీర్తి బ్రౌన్‌కే దక్కుతుంది.

కడపలోని బ్రౌన్ కాలేజిలో పండితుడిగా ఉండిన ములుపాక బుచ్చయ్య శాస్త్రి ఈ విషయంగా వ్రాసిన మాటలిలా ఉన్నాయి. "సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి శబ్ద శాసన సూత్ర సహితవృత్తి లక్ష్య లక్షణ గురులఘువర్ణగణవార్తికావృత్తి విద్వన్మతానువర్తి" అయిన బ్రౌన్ వసుచరిత్ర విషయం చూడమన్నాడని చెప్పుకొన్నాడు. బుచ్చయ్య శాస్త్రి వ్యాఖ్యానం బ్రౌన్‌కు నచ్చలేదు. సాహిత్యం ప్రజాబాహుళ్యంలోకి చొచ్చుకొని పోవాలని బ్రౌన్ ఆశయం. మళ్ళీ జూలూరు అప్పయ్య పండితుని చేత సులభశైలిలో వసుచరిత్రకు వ్యాఖ్యానం వ్రాయించి 1844 లో ప్రచురించాడు. అదేవిధంగా మనుచరిత్రను వ్యాఖ్యానసహితంగా 1851 లో అచ్చువేయించాడు.

బైచరాజు వెంకటరాజు రచించిన పంచతంత్ర, హంసవింశతులకు పదసూచికలు సంతరించాడు. సింహాసన ద్వాత్రింశిక కధాసారాన్ని 43 పుటల్లో ఆంగ్లంలో సంగ్రహించేశాడు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానాన్ని 1842 లోను వైజయంతీ విలాసాన్ని 1849 లోను అచ్చు వేయించాడు. కళాపూర్ణోదయం, తారాశశాంక విజయం, విజయ విలాసం, కుచేలోపాఖ్యానాలను ముద్రింప చేశాడు. పాతికేళ్ళలో దాదాపు పాతిక ప్రబంధాలను పరిష్కరింపచేసిన/సాహితీ వ్రతుడు సి.పి. బ్రౌన్.

ఆంధ్రుల సామాజిక జీవితాన్ని చిత్రించిన పల్నాటి వీర చరిత్ర విభిన్న ప్రతులనెన్నింటినో సేకరించి పండితులచే పరిష్కరింప చేశాడు. బసవ పురాణము ప్రభులింగ లీల మొదలైన శైవ పురాణాలను పరిష్కరింప చేశాడు.

గ్రంథ సేకరణతో పాటు బ్రౌన్ సాహిత్య సంబంధమైన ఇతర సామగ్రిని కూడా అపారంగా సేకరించాడు. చాటు పద్యాలు, జానపద గీతాలు, సామెతలు, పలుకుబళ్లు సేకరించాడు. తన కాలం నాటి పత్రికలలో వెలువడిన వ్యాసాలు, సంపాదకీయాలు, వార్తలు, లేఖలు మొదలైన వాటిని సేకరించి మంచి కాగితాలపై వ్రాయించి ముందు తరాల వారికి అందజేశాడు. తాను విన్న కథలను, గాథలను వ్రాయించి పెట్టాడు. మెకంజీ సేకరించిన స్థానిక చరిత్రలను మంచి కాగితాలపై వ్రాయించాడు. ఇవి 62 సంపుటాలైనాయి. తెలుగు సంస్కృత వ్రాత ప్రతుల సేకరణకై బ్రౌన్ 30 వేల రూపాయలు ఖర్చుపెట్టాడు.

తెలుగు సాహిత్యంలో బ్రౌన్ ముద్రపడని ప్రాచీన కావ్యం లేదనటంలో నిజం లేక పోలేదు. మంత్రతంత్ర శాస్త్రములకు సంబంధించిన ఆనందతంత్రం, సౌందర్యలహరి, కులార్ణవం మొదలైన సంస్కృత గ్రంథాలను సేకరించటం అతని జ్ఞానదాహాన్ని తెలుపుతుంది. 14-3-1834 తేదిన బ్రౌన్‌కు వ్రాసిన జాబుమేరకు, బ్రౌన్ ఋగ్వేద భాష్యం వ్రాయించినట్లు తెలుస్తున్నదని ముక్త్యాల సంస్థానం నుండి వెలువడిన సరస్వతీ పత్రిక ప్రకటించింది.

తెలుగు సాహిత్యాభివృద్ధికి ఇంత దోహదం చేసిన బ్రౌన్ తాను ఎంత చేసినా పూర్తిగా ఒక భాషయొక్క సాహిత్యాన్ని ఉద్ధరించటం అసాధ్యమని తన స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నాడు. ఈ విధంగా అనన్యంగా అనితరసాధ్యంగా తెలుగు సాహిత్య సముద్ధరణకు అంకితమై, కునుకుతున్న ఆంధ్రసాహిత్య దీపాన్ని ప్రజ్వలింపచేసిన బ్రౌన్‌ను వేనోళ్ళకొనియాడుతూ "సరస్వతికి ప్రస్తుతమంధు తమరు వొకరే నివాస స్థానముగా కనబడుతున్నారు. గనుక యెక్కడ యేయే విద్యలు దాచబడి వున్నవో అవన్నీ తమంతట తామే తమ సన్నిధికి వస్తూ వున్నవి. యీలాగు రావడము వల్ల ఆయా

విద్యలు అభివృద్ధి అవుతూ వున్నవి. యీ కాలములో యీ విద్యలను తమవలె అభివృద్ధి చేయించేవారు నేను యెరిగి వున్నంత మట్టుకు యెవరూ కనబడలేదు. యిందున గురించి తమరు పుచ్చుకొన్న ప్రయాస వల్ల తేలిన పరిష్కార గ్రంధములు ఆకల్పాంతమును తమ యొక్క కీర్తిని విస్తరింపచేస్తుంటవి" అని వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి అన్నాడు.

"ముదివిటులు విధవ లంజలు పదకవితలు" అంటూ పండితులచే విమర్శింపబడిన ద్విపదకావ్యాలను బ్రౌన్ అభిమానించాడు. పదమూడు ద్విపద కావ్యాలను పరిష్కరింపచేసి ఇరవై ఐదింటికి కాగితపు ప్రతులు వ్రాయించాడు.

ద్విపదకావ్యాలు బ్రాహ్మణేతరుల రచనలు అన్న అభిప్రాయం ఉండేది. బ్రౌన్ వీరశైవుల మత గ్రంధమైన బసవ పురాణము అద్భుత కథల సంకలనమని భావించాడు. బాణాల శంభుదాసు రచించిన ద్విపద సారంగధర చరిత్రను బ్రౌన్ 1827 లో పరిష్కరించాడు. ప్రభులింగలీల అనే శైవ మత సంబంధమైన ద్విపదను ఆంగ్లంలోకి అనువదించాడు. బసవ పురాణం, పండితారాధ్య చరిత్రల ఆధారంగా బ్రౌన్ శైవమతాచారములను అవగాహన చేసుకొని జంగముల ఆచార వ్యవహారాలను వెల్లడించాడు.

ద్విపదలలో హరిశ్చంద్ర కావ్యాన్ని నవనాధ చరిత్రలో కొంత భాగాన్ని మొట్టమొదట అచ్చు వేయించిన కీర్తి బ్రౌన్‌కే దక్కుతుంది. నిరాకృతములైన ద్విపదకావ్యాలకు గౌరవప్రదమగు స్థానాన్ని కల్పించిన మహనీయుడు బ్రౌన్.

ఆంధ్ర భాషా భూషణాలనదగిన శతకాలు పండిత పామరజనులకు బాల బాలికలకు అత్యంత ప్రీతి పాత్రములు. కాని విన్నకోట పెద్దన శతకాలను క్షుద్ర రచనలన్నాడు.

కావ్యాలు ప్రబంధాలు ద్విపదలు మొదలైన వాటినేకాక 84 శతకాలను సేకరించి పరిష్కరించినవాడు బ్రౌన్. ప్రజల నాలుకపై నడయాడే వేమన పట్ల బ్రౌన్‌కు అమితమైన ఆదరాభిమానాలు ఏర్పడినాయి. అబేదుబాయ్ రచించిన గ్రంథంలో వేమన ప్రస్తావనను మొదటిసారి చూచాడు. 1824 లో బ్రౌన్ కొత్తగా తెలుగు నేర్చుకొనేవారికి వేమన పద్యాలు విశేషంగా ఉపయోగపడతాయని విశ్వసించాడు. గ్రీస్ దేశస్థుడైన లూషియన్ కవి వలె వేమన తెలుగు ప్రజలకత్యంత ప్రీతి పాత్రుడని బ్రౌన్ భావించాడు.

1834 నాటికి దాదాపు మూడువేల వేమన పద్యాలను సేకరించాడు. తిప్పాభట్ల వెంకట శివశాస్త్రి సహకారంతో గూఢార్థాలను గ్రహించాడు. ఆంగ్లభాషలోను తెలుగు లోను గొప్ప పాండిత్యం సంపాదించిన బ్రౌన్ వేమన పద్యాలను ప్రధానంగా భావానువాదం చేశాడు. అవి మూలానికి అతి సన్నిహితంగా ఉంటాయి. బ్రౌన్ అనువాద రీతికి రెండు ఉదాహరణలు (Verses of Vemana in the Telugu Original with English Version - Asian Educational Services.New Delhi.1986.)

శిలలు జూచి నరుడు శివుడని మెత్తురు
శిలలు శిలలుగాని శివుడు గాదు
తనదులోని శివునిదానేల దెలియడో విశ్వ (905)

Men imagine stones to be siva, and magnify them. Stones are stones, not siva why is it that we cannot discern siva who dwells within us ?

పూడ్చిపెట్టిన సొమ్మెల్ల భూమిపాలు
బైలనుంచిన సొమ్మెల్ల పరులపాలు
తిండికొచ్చిన సొమ్మెల్ల తినుకుపాలు
దానమిచ్చిన సొమ్మెల్ల తనకు వేమ (1064)

All wealth that is buried falls to the share of the earth, all that is out falls into the hands of others, all that we eat is the gain merely of straining inner system, what is bestowed alone remains ours.

జాతి నీతి వేరె జన్మము లొక్కటి
యరయ తిండి వేరె యాకలొకటి
పసులవన్నె వేరె పాలెల్లయొక్కటి ...విశ్వ (1208)

Classes and customs vary but birth is one. Viands differ but hunger is one.

ఈ ఆంగ్లానువాద పద్యాలను బ్రౌన్ 1829 ప్రచురించి వేమన కీర్తితో పాటు తెలుగువారి కీర్తిని కూడా విశ్వవ్యాప్తం చేశాడు.

"శతకాలల్లిన వారు క్షుద్రులనుచున్ శాస్త్రజ్ఞులంద్రద్దిరా
శతకాలల్లని యట్టి కోవిదులహెూ ! క్ష్మామండలిన్ గల్గిరే
శతకాలల్లిన వారు కారె కన ధూర్జట్యాదు లవ్వారి యా
యతకీర్తిం గొఱ యేమి కల్గినది దక్షారామ భీమేశ్వరా !

(తెలుగు రాజా కృతుల నుండి)

ప్రసిద్ధములైన కావ్యముల పట్ల ఎంత శ్రద్ధ చూపినాడో అంతే శ్రద్ధ శతకాల పట్ల చూపటం బ్రౌన్ గుణ గ్రహణమును సూచిస్తుంది.

ఎనభై కంటె ఎక్కువగ శతకములను సేకరించాడాయన. పండితుల సహాయంతో పరిష్కరించి శుద్ధ ప్రతులను తయారు చేయించాడు. బ్రౌన్ ముద్రించిన గ్రంథాలలో శతకాలే ఎక్కువ. ఈ శతకాల పరిష్కరణలో జూలూరి అప్పయ్య శాస్త్రి బ్రౌన్‌కు బాగా తోడ్పడినాడు.

కలువాయి చెన్న కృష్ణ శతకం, కవి చౌడప్ప శతకం, కాళహస్తి లింగశతకం, భళిరకరి వేల్పు శతకము, కోదండరామ, సిద్ధిరామ కాంతాలలామ శతకాలను బ్రౌన్ 1832 లో పరిష్కరించి అచ్చు వేయించాడు. సుమతి భాస్కర శతకాలకు వ్యాఖ్య వ్రాయించాడు.

సుమతి శతక పద్యాల అనువాదములు రెండు:

"ఉపకారికి నుపకారము.
విపరీతము గాదు సుమ్ము ఏడుకు పిడే
యపకారికి నుపకారము
నెపమెన్నక సేయు వాడె నేర్పరి సుమతీ

"That kindness should be shown to the kind is no marvel, for it is merely all exchange. But he who shows kindness to the unkind without laying a fault to him is the wisest of men"

"బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహంబు బడయుట మేలా

బలవంతమైన సర్పము
చలిచీమల చేత జిక్కి చావదె సుమతీ"

"I am strong what care I ? says he; but what good will he get of incurring the hatred of others ? Did never a snake however mighty die by falling into the power of black ants ?"

తెలుగు భాషా సాహిత్యాలపై బ్రౌన్ వ్రాసిన వ్యాసం (1839-40) ఆయనకున్న పరిపూర్ణమైన అవగాహనకు దర్పణంగా వుంది. తెలుగు కావ్యాల సేకరణ, పరిష్కరణ, ముద్రణ మొదలైన విషయాలలో చూపినంత శ్రద్ధ ఆయా కావ్యభాగాలు ఆంగ్లానువాదం చేయటంలో కూడ కనబడుతుంది.

బ్రౌన్ విరాట పర్వంలోని తిక్కన పద్యాన్ని అనువదించిన తీరు చూడండి.

శా॥ సింగంబాకటితో గుహాంతరమునం 'జేడ్పాటు మైనుండి మా
తంగ స్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాస ఖిన్నమతి యస్మత్సేనపై వీడెవ
చ్చెం గుంతీ సుత మధ్యముండు సమరస్థేమాభిరా మాకృతిన్"

As when a lion strong with hunger, Views
From out of his cave, of elephants herd
And springs with sudden rage abroad his heart
Full of the bitter grief of solitude
Behold against our army rushes forth
The Third who joys in battle with a form
Impenetrable dreadful Arjun he"

భాగవతంలోని అతి ప్రసిద్ధమైన గజేంద్రమోక్షంలోని పద్యాన్ని ఇంగ్లీష్‌లో ఇలా అనువదించాడు.

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చె తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా"

"I faint for breath, my strength is gone, I die My soul is spent, this is my last sigh I think my limbs are yielding I am gone, thou art my sole reliance thou alone save me, o lord rescue my sinking heart, my hope, my life, my all alone thou art !

పాశ్చాత్యుల సంపర్కం వల్ల మనకు కల్గిన గొప్పలాభం ముద్రణం. విదేశీయులైన క్రైస్తవ మతప్రచారకులు, మత సంబంధమైన కరపత్రాలను, బైబిల్ అనువాదాలను అచ్చు వేయించేవారు. క్రమంగా ముద్రణ ఒక కళగా వృద్ధి చెందింది. మౌఖికమైన అధ్యయన పద్ధతి కొందరికే పరిమితంగా ఉన్నకాలమది. ముద్రణ వల్ల పద్యం సామాన్యులకు కూడా అందుబాటు లోకి వచ్చింది. ఈ రీతిగా ముద్రణ సాంఘిక విప్లవానికి చేయూత నిచ్చింది.

బెంజమిన్ షుల్జ్ అనే జర్మన్ మిషనరి (1689 - 1760) "నిజమైన క్రైస్తవుడు జీవితము గడపవలసిన నూరు విధులు" అను తెలుగు పుస్తకాన్ని మొదట జర్మనీలోని హ్యాలే పట్టణంలో

(1746 లో) అచ్చు వేశాడని పరిశోధకుల అభిప్రాయం. తెలుగులో ముద్రణకు నోచుకున్న మొదటి పుస్తకం ఇదేనని కొందరి నమ్మకం.

బ్రౌన్ తెలుగు భాషాధ్యయనం ప్రారంభించటానికి ముందే బెంగాల్ లోని శ్రీరాంపూర్‌లో డాక్టర్ విలియం కేరే ముద్రణా యంత్రాన్ని నెలకొల్పి దాదాపు భారతీయ భాషలన్నింటికీ అక్షరాల పోత పోయించాడు. కలకత్తాకు చేరువగా వున్న డేవిడ్ బ్రౌన్‌కు శ్రీరాంపూర్ అచ్చు కూటముతో పరిచయం ఉండేది.

బ్రౌన్ తెలుగు అక్షరాల ఆకారాన్ని అచ్చులో కొన్ని మార్పులను చేశాడు. ధ్వనులకు కొత్త గుర్తులు కల్పించాడు. అర్ధానుస్వారాలు శకటరేఫాలు నిరుపయోగములని తన ఛందో గ్రంథంలో వ్రాశాడు.

"ఇరువది సంవత్సరముల కంటె పైగా బ్రౌన్ దొర చెవినిల్లుకట్టుకొని పోరిన ఫలితముగా, తెలుగు దేశములో పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధము వచ్చునాటికి గ్రంథ ముద్రణము బాలారిష్ట దోషము లను దాటి స్థిర పడింది.

"తెలుగు సాహిత్యాభివృద్ధికి ఇంత దోహదము చేసిన బ్రౌన్ దొర కూడ తాను విదేశస్థుడనియు, తానెంత చేసినను పూర్తిగా ఒక భాష యొక్క సాహిత్యమును ఉద్ధరించుట సులభ సాధ్యము కాదనియు తన వినయమును ప్రకటించెను" (సి.పి.బ్రౌన్ - మలిముద్రణ డా|| కొత్తపల్లి వీరభద్రరావు - పుట 292)

## వ్యాకరణ గ్రంథం

తెలుగు ఛందో వ్యాకరణాలను బ్రౌన్‌కు నేర్పినవారు వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి తిప్పాభట్ల వేంకట శివశాస్త్రి గార్లు. దేశీయ పండితుల భాషా బోధన బ్రౌన్‌కు ఎంత మాత్రం నచ్చలేదు. తెలుగు నేర్చుకొనే పాశ్చాత్యుల కోసం బ్రౌన్ స్వయంగా వ్యాకరణం రచించి 1840 లో ముద్రించాడు ఆయన వ్యాకరణ రచనలో వ్యావహారికానికి ఎక్కువ ప్రాముఖ్యమిచ్చాడు.

బ్రౌన్ రచించిన వ్యాకరణ గ్రంథం లోని నామ వాచకాల భాగాన్ని చదివేటప్పుడు మన మొక నవల' ను చదివినట్లుంటుంది. ఆంగ్లేయుల ఇంటి పేర్లను, మన ఇంటి పేర్లను గురించి తులనాత్మకంగా వ్రాసిన భాగం హృద్యంగా ఉంది. సాంస్కృతికంగా పరస్పరం పరిచయం చేసుకోవటానికి ఉపయుక్తంగా ఉందీ రచన.

జమీందారీ కుటుంబాలకు, పాలక వర్గాలకు చెందిన తెలుగు స్త్రీల పేర్ల చివర 'అమ్మ' కు ముందు 'అయ్య' (సీతయ్యమ్మ అనునట్లు) ఉండేది. కొన్ని చోట్ల 'అమ్మ' చేర్చకయే స్త్రీల పేర్లకు గూడ ''అయ' 'సీతయ్య' ఉండేది. ఇటువంటి ఆచారం స్కాట్లండు దేశంలోని గొప్ప కుటుంబాలలో ఉన్నదన్నాడాయన. అక్కడ గొప్ప ఇంటి స్త్రీలకు 'సర్' అనివాడం జరిగేదన్నాడు. ఇటువంటి వింత విషయాలెన్నో ఈ గ్రంథంలో ఉన్నాయి.

## 5. లేఖలు

తెలుగు వాఙ్మయంలో కూడా లేఖాసాహిత్యాన్ని ఒక ప్రక్రియగా గుర్తించ వచ్చు. దీనికి మూల పురుషుడన దగిన వ్యక్తి బ్రౌన్.

"చారిత్రక ప్రాధాన్యమూ విషయభరితమూ సాహిత్య గౌరవమూ కలిసి పండితాదరణకు పాత్రమైన జాబులే లేఖా సాహిత్యంలో చేరుతాయి. మహనీయులు వ్రాసిన లేఖలు వారి దృక్పధాన్ని ఆత్మీయతను, వ్యక్తిత్వాన్ని ప్రతిబింబించే దర్పణాలు జనాదరణీయాలు, అవశ్య పఠనీయాలు - జీవిత చరిత్ర. సామాజిక చరిత్రల రచనలకు ప్రబలాధారాలు. ఈ దృష్టిలో మహనీయులకు - వ్రాసిన లేఖలు గణనీయాలే "(బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు" అనుశీలన ఆచార్య జి. యన్.రెడ్డి)

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో బ్రౌన్ సేకరించి వ్రాయించిన తెలుగు ఉత్తరాలు - తనకు పండితులు, సేవకులు అప్పులు పత్రికల నుంచి ఎత్తి వ్రాయించినవి వగైరా 20 సంపుటాలున్నాయి. ఒక్కొక్క సంపుటంలో 400 పుటలు కలవి భద్రపరచిపోయాడు. "ఆనాడు బ్రౌన్ సేకరించిన ఈ సంపుటాలు ఈనాడు భాషా చరిత్ర కారులకు తరగని నిధు"లన్నారు ఆచార్య జి యన్ రెడ్డి

19వ శతాబ్దంలో తెలుగు భాషా స్వరూప లక్షణాలు, సంప్రదాయాలు, లేఖావతారిక విషయం లేఖాంతం ఎలా ఉండేవే తెలుసుకోవటానికి రెండు జాబులు ఉటంకించబడినాయి.

**"ధర్మపురం సుబ్బన్న జాబులు" 30**

మహారాజశ్రీ సి.పి. బ్రౌన్ యిస్కాయరు దొరవారి దివ్యసముఖానకు -

తమ పోష్యవర్గుడైన ధర్మపురం సుబ్బన్న అనేక సల్లాములు చేసి అత్యంత వినయ విధేయ పూర్వకముగా వ్రాసుకున్న వి నవి. యేమంటే - తమ యొక్క బంగళాలో దిగి వుండబడిన మేస్తరు కోపివేష్టన్ దొరగారు లో వయినం కొత్తగా కట్టించిన దక్షిణపుతట్టు సహం బంగళా చుట్టూ మూడు పార్శ్వముల యందున్ను వుండబడిన వసారాకు పయిన చేయించి వున్న గచ్చు పగలకొట్టించి పెంకులు కప్పించి అందుకు సమానముగానే వుత్తరపు తట్టు సహం బంగళా యొక్క తూర్పున్నూ వుత్తర భాగంలో సఖమున్ను వసారా విప్పుదీయించి చావిడిని సందు బిగువులు వేయించి రెండేసి అంఖణాలు కల్పి వక అంఖణం చేసి అద్దముల తల్పులు తీసి వేసి పూరా దర్వాజాలు వుంచి యీ ప్రకారం బంగళా కట్టిస్తూ వుండి సదరహీ దొరగారు పట్నానకు వేంచేసి వున్నారు. 7-8 రోజులలో మరహమత్తు సిద్ధమవుతూ వున్నది. మరిన్ని వేరే పశువులను కట్టివేస్తు వుండబడిన వక ఇల్లున్ను చక్కచేయించి వున్నాను.

యిదిన్నిగాక బంగళాకు కొంచెం పశ్చిమం తట్టు వుండబడిన రెండు దిరసనపు చెట్లున్ను బంగళా యొక్క తూర్పు. వసారాకు వుత్తరపు తట్టున్ను కాలిజా కొట్టానికి తూర్పు భాగాన వుండబడిన వక వేప చెట్టున్ను యీ ప్రకారం మూడు చెట్లున్ను కురారం కొట్టించి వున్నారు. గనుక వున్న సంగతి వేద్యం చేసి వున్నాను

బంగళాకు చేరిన పక్కశాలయున్ను అశ్వశాలకు వేయబడిన వక దూలం విరిగిపోయి వున్నందున అదిన్ని చక్క చేయించవలసినది గనుక వున్న సంగతి మనవి వ్రాసుకున్నాను.

వెరసి మూడు కలముల అర్జిన్ని దివ్య చిత్తానకు తెచ్చి నన్ను సంరక్షించగలందులకు తాము ఖామందులు వున్నారు.
దివి 4 అకటుంబరు 1838 సం॥
- ధర్మపురం సుబ్బన్న

**ధర్మపురం సుబ్బన్నకు 31**

మహారాజశ్రీ శి.పి. బ్రౌన్ ధొరవారు వ్రాయించిన అజ్ఞ యేమంటే - నీవు మా పేర వ్రాశి పంపించిన వుత్తరం చదువుకోంగా చాలా సంతోషమయినది. వుత్తరం పట్టుకుని వచ్చిన మనిషికి భత్యం ఖర్చుకింద వక రూపాయి యిప్పించి వున్నాము. మాకు కొన్ని గ్రంధములు కావలసి వుండగా జాగ్రత్త చేస్తానని వ్రాసినావు గనుక సంతోషించినాము. అట్లా చేసిన పక్షమందు అయ్యే ఖర్చు ముజరా యిప్పిస్తున్నాము.

మరిన్నీ భానుమద్విజయం అనే తెలుగు గ్రంధం కడపలో యిప్పుడు దొరికితే దానిక ప్రతి పుట్టించుకుని పదిరూపాయలు యినాం ఇప్పిస్తున్నాము. మాతృక మా దగ్గరకు పంపించ డానకు అభ్యంతరమయ్యే పక్షమందు అక్కడనే ప్రతి పుట్టిస్తున్నాము. ముఖ్యంగా యిది శప కావ్యము. అయిదు. ఆశ్వాసములు కలది - వెలగపూడి కృష్ణయ్య కవి చెప్పినది. యిది తెలుగు కావ్యము గనుక వకవేళ కడపలో దొరకవచ్చును. పయిగా పయిడిమర్రి వెంకటపతి చెప్పిన చంద్రాంగద చరిత్ర అయిదు ఆశ్వాసములు గలది. ముఖ్యం కావలసియున్నది యిదిగాక జంగమ పుస్తకాలలో కొన్ని కావలశియున్నవి. అవి కన్నడభాషల్లో గనుక కన్నడ వాండ్ల వద్ద విచారించవలెను. యేమంటే - ప్రభు లింగలీల 1 బసవపురాణం 1 బసవకాలజ్ఞానం 1 వీటిలో ముఖ్యంగా లీల కావలసినటిగా గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు నాపా చేయించేటందుకు మాకు భావం కలిగి వున్నది. యీ పనికిగాను అక్కడ యేదయినా వక పుస్తకం వ్రాయించవలసి వచ్చే పక్షమందు సాధారణంగా వచనం రీతిగా వ్రాయవలశినది పద్యములు నాలుగేశి చరణములుగా యేర్పర్చి వ్రాయవలసిన జరూరు లేదు.

వ్రాత అయిన తర్వాత మొకాబిలా చేయించవలసినది. యీ మనిషి నీ తావుకు పొయ్యేటప్పుడు వీని పరంగా నీ తావుకు కొన్ని పుస్తకములు దానంగా పంపిస్తున్నాము. సదరపిం వ్రాశిన గ్రంధములే కాకుండా యీ దిగువను వ్రాశిన గ్రంధములు కూడా మాకు కావలసి వున్నవి. కనుక వీటిని గురించి కూడా తలాషు చేసి పంపించవలెను.

1 సూర్య తనయా పరిణయం
1 చారు చంద్రోదయం
1 పండితారాధ్య చరిత్ర
1 రత్నావళి పరిణయం

యీ పుస్తకములు కూడా జాగ్రత్త చేశి పంపించవలెను.

ది12 డిశంబరు
ఆన 1840 సం॥

(పై రెండు లేఖలు - బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు కడపజాబుల సంకలనం

- పర్యవేక్షణ జి.యన్.రెడ్డి. పరిశోధనః బంగోరె - పుస్తకంనుండి 64 -65 -66 మ.ఓ.మే.లై. లోని బ్రౌన్ జాబుల సంపుటం ఎమ్ 411, పేజ 54)

"తెలుగు ప్రజలంతా తనకు చదువు చెప్పిన గురువులే" అన్నాడు బ్రౌన్. (డా॥ ఆరుద్ర) - ఇదీ అతని వినయశీలం.

## 6. నిఘంటువులు

బ్రౌన్ కు అజరామరమైన కీర్తిని సంతరింప చేసినవి అయన కూర్చిన నిఘంటువులు బ్రౌన్‌కు ముందు కాంబెల్, మారిన్, మామిడి వెంకయ్య మొదలైన వారు తెలుగులో నిఘంటువులను సమకూర్చారు. కాని నాటినుండి నేటివరకు పండితులకే కాక సామాన్యులకు కూడా ఉపయోగపడే బృహన్నిఘంటు నిర్మాణంలో బ్రౌన్ అగ్రగణ్యుడు. బ్రౌన్ పాండితీ గరిమ నిశిత ప్రజ్ఞకు సాక్ష్యాలు బ్రౌన్ నిఘంటువులు. వంద సంవత్సరాలు గడచినా, బ్రౌన్ నిఘంటువులు ఏ మాత్రం సంస్కరించకుండా 1852 ప్రతిని 1966 లో యథాతథంగా ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి ముద్రించడంలో ఆ నిఘంటువుల వైశిష్ట్యం ద్యోతకమవుతుంది.

"తెలుగు భాషాధ్యయన సందర్భములో తానీ నిఘంటువును తన కోసం కూర్చుకున్నట్లు బ్రౌన్ ఈ నిఘంటు ఉపోద్ఘాతంలో వ్రాసుకొన్నాడు. ప్రాచీన గ్రంథాలు శతకాలు, కావ్యాలు మొదలైన వాటిలో లభించే పదాలతో పాటు జనసామాన్యం వాడుక లో గల అనేక పదాలు చేర్చబడినందున ఈ నిఘంటువు అందరికీ ముఖ్యంగా అనువాదకులకు కల్పవృక్షంగా వినియోగపడింది.

బ్రౌన్ నిఘంటువుల ప్రత్యేకతలివి.

1. గ్రంథస్థమైన పదాలతో పాటు వాడుకలో గల పదాలు కూడా చేర్చబడినాయి.
2. అవసరమైన చోట పూర్వకవి ప్రయోగాలు ఆరోపాలతో పాటు చూపబడినాయి.
3 పదాలకు అర్థాలు గ్రందాల నుంచే కాక వాడుక నుంచి కూడా స్వీకరించబడినాయి.
4. సామెతలు, జాతీయాలు చేర్చబడినాయి.
5. ఆంగ్లసమానార్థాలు వీలైనన్ని ఎక్కువగా ఇవ్వబడినాయి.

సాధారణంగా మన నిఘంటు కర్తలు పదాలకు అర్థాలు ఇచ్చేటప్పుడు వృక్ష విశేషం, భక్ష్యవిశేషం, క్రీడా విశేషం అని ఇస్తారు. కాని బ్రౌన్ అలా కాక వాటి అసలు పేర్లు, సంకేతాలతో పాటు ఇచ్చాడు. ఈ విషయంలో బ్రౌన్ చేసిన బహుగ్రంథ పరిశోధన స్పష్టమవుతున్నది.

తెలుగు ఇంగ్లీష్ నిఘంటువు నుంచి కొన్ని ఉదాహరణలుః

**అంటిచెట్టు A plantain tree, కదళీవృక్షము**
**అంటు మామిడిచెట్టు A graft mango tree**
**అటికె మామిడి A spreading plant called hogweed**

మరికొన్ని పదాల ప్రయోగాలు:
"నేనిక్కడ ఉండటం వల్ల ఫలమేమి
గురుడు వేశ్య కన్నకుల హీనుడేసుకో
What, is the doctor inferior to the dancer ?
'నేరు' అనుమాట మన నోళ్ళ ఎలా నలుగుతున్నదో వివరిస్తూ బ్రౌన్
నేరు ముయ్యి - hold your tongue
నేరు లేని వాడు a simpleton, నేరుకొట్టుట to silence నేరుగాచుట to watch his life,
నేరెత్తుట to raise the voice, cry, speak..
అకారాది నిఘంటునిర్మాణంలో బ్రౌన్ కొన్ని మార్పులు చేశాడు.

"ఒక వర్గాక్షరానికి చెందిన అన్ని మాటలూ పూర్తి అయిన తర్వాత మరొక అక్షరం స్వీకరించటం పరిపాటి. కాని బ్రౌన్ అలా చేయక కాఖాగా ఘూ లూ క కీ ఖి ఖీ గి గీ ఘి ఘీ లూ ఇలా స్వీకరించాడు. ఇందువల్ల కంకము, గంగ ఖంజము ...అను మాటలు ఉదహరించాడు ఈ విధానం వల్ల 'గండ పెండేరం' తర్వాత కండపెట్టుట అనేమాట కనిపిస్తుంది గాని గండభేరుండము రాదు. కనుక బ్రౌన్ అవలంబించిన యీ ప్రాథమిక పద్ధతి ఈనాడు అంత సుకరమని తోచదు. కాని కవి ప్రయోగ ప్రామాణ్యంతో నిఘంటు రచనా విధానాన్ని శబ్ద రత్నాకరాది తరువాతి నిఘంటువులు అనుసరించాయి.

1844 లో తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువు ముద్రణను ప్రారంభించి 1852 లో పూర్తి చేశాడు. 1982 లో న్యూఢిల్లీకి చెందిన తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువులలోని పుటలు 1416

ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువు ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువు 1845 లో ప్రారంభింపబడి 1853 లో పూర్తి అయిందట.

**ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువు**

ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువు కూర్పటంలో ఆయన ముఖ్యోద్దేశం ఆంగ్ల సాహిత్యం. మన వారికి అందుబాటులో రావలెననే.

తెలుగు నిఘంటువులో లాగా ఇందులో గూడ ఆంగ్లపదాలకు అర్థాలను యిచ్చేటప్పుడు జీవభాషలోని పదాలను స్వీకరించాడు.

**మిశ్రభాషానిఘంటువు**

మిశ్ర భాషా నిఘంటువు 1854 లో ముద్రించబడింది. ఈ నిఘంటువును కూర్చటంలో ప్రధానమైన ఉద్దేశం ముస్లింల పాలన వల్ల తెలుగు భాషలో చేరిన అన్యదేశ్యాలను అర్థవివరణముతో చూపటం. అరబిక్, పారసి, ఉర్దూ భాషా పదాలే కాక తమిళ, కన్నడ, మహారాష్ట్ర భాషా పదాల అర్థాలను కూడా యిచ్చాడు. ఈ నిఘంటువును తెలుగు నిఘంటువుకు అనుబంధంగా ఇచ్చినప్పటికీ దీనిని ప్రత్యేక నిఘంటువుగా పరిగణిస్తారు. సాధ్యమైనంతవరకు మిశ్రభాష

ఉపయోగించవద్దని బ్రౌన్ సూచించటం అతని ఆంధ్ర భాషాభిమానానికి సాక్ష్యం.

**జిల్లా నిఘంటువు**

అనుదిన పాలనా వ్యవహారంలో ఉపయోగించే పదాలను సేకరించి నిఘంటువును కూర్చేపనిని కంపెని డైరక్టర్లు 1842 లో బ్రౌన్‌కు అప్పగించారు. వివిధ జిల్లాలలో పనిచేసిన అనుభవం ఇందుకు ఆయనకు ఉపకరించింది. బ్రౌన్ గృష్టిలో ఇది చిన్నదని. కాని దీనిమీద కటువైన విమర్శ వచ్చింది. ఈ నిఘంటువు 1855 లో విల్సన్ ప్రచురించిన గ్లాసరీ ఆఫ్ జ్యూడిషియల్ అండ్ రెవెన్యూ టెర్మ్స్‌లో విలీనం చేయబడింది. దీని ప్రతి నేటికి డిల్లీలోని నేషనల్ ఆర్కైవ్ లో భద్రంగా ఉంది.

**లిటిల్ లెక్సికన్**

క్రైస్తవ విజ్ఞాన సంఘంవారి కోరిక మేరకు బ్రౌన్ దీనిని 1852 లో ప్రచురించాడు. ఈ నిఘంటువులో కోస్తా, రాయలసీమలోని వాడుక పదాలు ఎక్కువగా ఉన్నాయి. ఈ నిఘంటువుకు అనుబంధంగా వ్యాకరణ విశేషాలు, తెలుగు వాచకం చేర్చబడినాయి.

బ్రౌన్ నిఘంటువులను ఎవరెట్లా విమర్శించినా అతని నిష్పాక్షపాత్యాన్ని సత్య నిష్ఠను శంకించే వారుండరు. బ్రౌణ్య నిఘంటువుల తరువాత బయలుదేరిన నిఘంటువులలో బ్రౌణ్యమునుపయోగించుకొననిది లేదని చెప్పిన సత్యదూరము కాదు. (సి.పి. బ్రౌన్ - డా. కొత్తపల్లి వీరభద్రరావు పుట 351)

బ్రౌన్ సేకరించి మదరాసు సాహిత్య సంఘమునకు అందజేసిన లిఖిత గ్రంథాల సంఖ్య 2440. కొన్ని గ్రంథాలు వివిధ లిపులలో ఉన్నాయి.

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| సంస్కృతం | తెలుగు | 1,273 |
| ,, | దేవనాగరి | 16 |
| ,, | మలయాళ | 5 |
| ,, | వంగ | 5 |

సంస్కృత భాషలో నున్నపైగ్రంథాల సంఖ్య 1299. ఇతర భాషలలోని గ్రంథాలు.

| భాష | లిపి | సంఖ్య |
|---|---|---|
| తెలుగు | తెలుగు | 1116 |
| కన్నడం | కన్నడం | 18 |
| మలయాళ | మలయాళ | 3 |
| బర్మా | బర్మా | 4 |
| | పై గ్రంథాల సంఖ్య | 1,141 |

1836 నాటికి సంస్కృతాంధ్ర గ్రంధాల సేకరణకు 30 వేల రూపాయలకు పైగా సొంతపైకం ఖర్చు చేశాడు.

"The library of sanscrit and Telugu manuscripts which I have collected cost me more than 30,000 rupees."

ఇవన్నీ కాక, జాతి స్వరముల సాహిత్యం అను సంగీత శాస్త్ర గ్రంధాన్ని చిత్తూరు శేషయ్య నుంచి తీసుకొన్నాడు. (1833లో)

## 7. చిన్న రచనలు కొన్ని

బ్రౌన్ అభిరుచులు అనంతమైనవి.వ్యాకరణం వంటి సాహిత్య రచనలే కాక ఎన్నో విషయాలను అధ్యయనం చేశాడు. వాటిపై వ్యాసాలు రచించాడు.

ఉద్యోగంలో చేరిన తొలిరోజుల్లోనే మద్రాసు కాలేజ బోర్డు సభ్యుడైన రిచర్డ్ క్లార్క్ కోరిక మేరకు 'ఆంధ్ర సంస్కృత భాషల ఛందస్సులను గురించి 56 పుటల చిన్న పుస్తకాలు వ్రాశాడు. పాశ్చాత్యులకు అర్థమయ్యే విధంగా గ్రీక్ - లాటిన్ భాషలలోని పోలికలను చూపుచూ ఈ చిరు రచన చేశాడు. ఈ రచన చదివి కోనింగ్స్ బెర్గ్‌లో నున్న గోల్డ్ స్టకర్ అనే యువకుడు సంస్కృత భాషాధ్యయనానికి పూనుకొన్నాడు. తర్వాత గొప్ప విద్వాంసుడై బ్రౌన్‌ను కలుసుకొని తన కృతజ్ఞతను తెలిపాడు. బ్రౌన్ ఆ పుస్తకాన్ని మరింత పెంచి 1869 లో అచ్చు వేశాడు.

భారతీయ శిల్పశాస్త్రం పై బ్రౌన్ పరిశోధనాత్మకమైన వ్యాసం వ్రాశాడు. అది మద్రాస్ గెజెట్ లోనే కాక ఏషియాటిక్ జర్నల్‌లో కూడా వెలువడింది. విగ్రహాలను చెక్కే శిల్పులతో సంభాషణలు జరిపి విగ్రహాలు చెక్కటం, శాస్త్రంలో వాటి కొలతలు, ప్రమాణాలు, ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా లో వర్ణింపబడిన పాశ్చాత్య దేశాల్లోని విగ్రహాల ప్రమాణాలతో పోలుస్తూ విశిష్టంగా రచించాడు.

దాదాపు ఇరువై నాలుగు భాషలలో పరిచయంతో పాటు పాండిత్యాన్ని కూడా గడించిన బ్రౌన్ ఉర్దూ సాహిత్యంలో వ్యంగ్య రచయితగా ప్రసిద్ధిగాంచిన సౌదా (1713 - 1780) రచనలను సేకరించి, సంస్కరింపించి, ముద్రింప చేశాడు. ఆ ప్రతి ఇండియా ఆఫీస్ లైబ్రరీలో వుంది.

సాహిత్య వ్యాసంగంలో తలమునకలవుతూ తీరికదొరికినపుడు హిందువుల ఆచార వ్యవహారాల మీద, నాటి విద్యా విధానం మీద ఎన్నోవ్యాసాలు వ్రాశాడు. రాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నల్‌లో ఆ వ్యాసాలు వచ్చేవి. ఈ విధంగా ఇతర ప్రాంతాల్లో కూడా తెలుగు వాఙ్మయ ప్రచారం చేశాడు.

సంస్కృతంలోని తాంత్రిక సాహిత్యం అతణ్ణి ఆకర్షించింది. బ్రహ్మాండపురాణంలోని లలితో 'పాఖ్యానాన్ని లాటిన్ భాషలోనికి అనువదించి, దానికి ఇంగ్లీష్‌లో కూడా 'నోట్స్' వ్రాశాడు.

మేషాది రాశుల పేర్లను గ్రీక్ భాషలోని 'జోడియక్' లతో పోల్చి వ్రాసిన బ్రౌన్ వ్యాసం కర్నాటక్ క్రనాలజీ లో ముద్రింపబడింది.

పాశ్చాత్యులకు 'శివలింగం' పట్ల గల దురభిప్రాయాలను తొలగించటానికి లింగ విషయంగా వ్యాసం వ్రాశాడు. ఇదంతా సత్య దృష్టిని పెంపొందించటానికి చేశాడు.

వీరశైవుల ఆచార వ్యవహారాల పట్ల వీర శైవమతోద్ధారకుడైన బసవేశ్వరుని పట్ల బ్రౌన్ ఎంతో శ్రద్ధ చూపాడు. బసవేశ్వరుని గొప్పదనాన్ని వర్ణించే బసవపురాణాన్ని కుదించి ఇంగ్లీష్‌లో రచించాడు.

మద్రాసు సమీపంలోని 'కురుమణిల్' అనే గ్రామ నామం పోర్చుగీసువారి వల్ల కోరమాండల్ (చోళమండల్) గాను 'కొల్లం' అన్న పదం పాశ్చాత్యుల ఉచ్చారణలో 'క్విలన్' గా మారిందన్నాడు. భాషా స్వరూపాల అధ్యయనం కూడా చేసినట్లు తెలుస్తుంది.

చారిత్రక విషయాల పట్ల ఆసక్తికల బ్రౌన్ "రాజుల యుద్ధాలు " అన్న అనంతపురం చరిత్రను ఇంగ్లీష్ లోనికి తర్జుమా చేసి 1853 లో ప్రచురించాడు. 79 పుటల ఈ గ్రంథం చక్కని వ్యావహారిక శైలిలో రచించాడు. డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారు రచించిన 'ముసలమ్మ మరణము' అన్న కావ్యేతి వృత్తం అనంతపురం చరిత్రలోనిదే.

ఆనాడు ప్రభుత్వం కొత్తగా నెలకొల్పిన పాఠశాలల బాలుర కోసం కథాసంపుటాలు వ్రాశాడు. బ్రౌన్ పట్ల ప్రగాఢమైన భక్తి శ్రద్ధలు గల రావిపాటి గురుమూర్తి పండితులు వ్యావహారిక భాషలో విక్రమార్క కథలు, పంచతంత్ర కథలు వ్రాసి బాల సాహిత్యవికాసానికి తోడ్పడినాడు.

"నెల్లూరు దేశస్థుడైన తాతాచార్యులు కావ్య, తర్క వ్యాకరణాల్లో నిండా ప్రవీణత గలవాడు. ఇతను ప్లవనామ సంవత్సరమునకు సరి అయిన 1841 లో చెన్నపట్నంలో ఉండే సి.పి.బ్రౌన్ దొరగారి వద్దకు వచ్చి తాను బ్రతికి వుండిన పరియంతరము ఆయన వద్ద కొలువులో ఉండినాడు. ఈ తాతాచార్యులు నిండా పెద్దమనిషి సరసుడు గనుక, సంభాషణలో సమయోచితమైన చిత్ర విచిత్ర కథలు చెప్పుతూ వచ్చినాడు. ఆ కథలు చేర్చి వొక గ్రంథముగా అచ్చు వేయడమైనది". (సి.పి.బ్రౌన్) ఈ 'కథలను 'పాప్యులర్ తెలుగు టేల్స్' అన్న పేరుతో బ్రౌన్ 1855 లో ప్రచురించాడు.

## పంచాంగం

భారతదేశంలో కంపెనీవారు స్థిరపడ్డారు. తెలుగు తిథి వార మాసాలకు బదులుగా దైనందిన వ్యవహారాల్లో క్రీస్తుశకం, ఇంగ్లీష్ తేదీల వాడకం అవసరమైంది. తిథి, వార మాసాలకు ఇంగ్లీష్ తేదీలకు సమన్వయం కావలసి వచ్చింది. బ్రౌన్ పర్యవేక్షణలో ఒక జ్యోతిష్కుడు క్రీ.శ. 1751 నుంచి 1850 వరకు గల ఆంగ్ల, హిందు, ముస్లింల కాలమానాన్ని తెలిపే పంచాంగాన్ని ప్రభుత్వం వారి కోరికపై తయారు చేశాడు. ఈ పంచాంగం ఆరువందల పుటలకు పెరిగింది. 1850 లో దీనిని అచ్చువేయించాడు.

## కర్ణాటిక్ క్రనాలజి

హిందూ విజ్ఞాన సర్వస్వమనదగిన కర్నాటిక్ క్రనాలజి బ్రౌన్ బహుముఖపరిశోధనా పాటవాన్ని, అధ్యయనాన్ని తెలుపుతుంది. తెలుగు -కన్నడ దేశాల చరిత్రకు సంబంధించిన పట్టికలను (Cyclic Tables of Hindu and Mahomedan chronology, regarding the History of the Telugu and Kannad countries) మద్రాస్‌లో బ్రౌన్ అచ్చు వేయించాడు.

ముస్లిముల "హిజరీని" గురించి వ్రాస్తూ అది క్రీ.శ 1600 నుంచి దక్షిణ భారతదేశంలో వాడుకలోనికి వచ్చినదని, ఫసలీ లెక్క ఈస్టిండియా కంపెనీ కొలువులోని హిందూ గుమాస్తాలచే క్రీ.శ 1800 నుంచి వాడుక లోనికి వచ్చినదన్నాడు.

కలిశకం క్రీ.పూ 3101 లో ప్రారంభమైనదన్నాడు. ఈ గ్రంథంలో తనకు తెలిసిన ఐతిహాసిక గణిత జ్యోతిష సాహిత్య సంబంధం గల హిందూ విజ్ఞాన విషయాల నన్నింటినీ సమీకరించాడు. ముస్లిమ్ చరిత్రకారుల రచనలనుంచి కొన్ని విషయాలు తీసుకొన్నాడు. బ్రౌన్ రచనలన్నిటిలో విశిష్టమైన కర్నాటిక్ క్రనాలజి 1863 లో ముద్రించబడింది.

కి.శ. 1500 వరకు గల చరిత్రకు మెకంజీ అతని పండితులు సేకరించిన శాసనాలను ఆధారం చేసుకొన్నాడు. మెకంజీ పండితులు కృష్ణానది మొదలు కన్యాకుమారి వరకు పర్యటించి చారిత్రక విషయసేకరణ చేశారన్నాడు. రాజ వంశాల వంశవృక్షాలను సిద్ధపరిచాడు.

రాజ వంశాలలో ప్రసిద్ధములైన యాదవ, చాళుక్య, కొంకణ, విజయనగర, మైసూరు,కొల్లం రాజుల వంశ వృక్షాలను, వారి పరిపాలనా విశేషాలను పేర్కొన్నాడు.ఐతిహాసిక కాలాన్ని మూడు భాగాలుగా విభజించి మొదటిభాగంలో క్రీ.శ. 1500 వరకు గల హిందూ రాజుల, ముస్లిమ్ నవాబుల చరిత్రను,రెండవ భాగంలో క్రీ.శ. 1500 నుంచి 1750 వరకు, పోర్చుగీస్, ఫ్రెంచి, డచ్ కంపెనీల చరిత్రను,ఇంగ్లీష్ వారు భారతదేశం చేరిన విషయాన్ని, మూడవభాగం లో క్రీ.శ. 1750 నుంచి 1857 వరకు ఆంగ్లేయుల రాజ్య స్థాపన మొదలైన విషయాలను ఇదివరలో ఎవరూ చేయని రీతిగా ఒక చోట చేర్చాడు.

హిందువుల ఘనతను తెలిపే ఖగోళ జ్యోతిష శాస్త్రాల వైశిష్ట్యాన్ని పేర్కొనటంతో పాటు వారికి చారిత్రక దృష్టిలేక పోవటం శోచనీయమన్నాడు. వాస్తవాంశాలను నిష్పాక్షికంగా వెల్లడించిన మహనీయుడు బ్రౌన్.

పాశ్చాత్య దేశాలలో భారతీయ ప్రతిభను తన రచనలద్వారాచాటిచెప్పి భారతదేశగౌరవాన్ని ఇనుమడింపచేశాడు. ప్రాచీన భారతీయులు చంద్రుని గమనాన్ని అనుసరించి చేసిన గణితం పాశ్చాత్యులను ఆశ్చర్య చకితుల కావించింది. మేషాది రాశుల గూర్చి వ్రాసిన భాగంలో బృహజ్జాతక , జాతక పారిజాతాది గ్రంథాల్లోని శ్లోకాలలో గ్రీక్ పేర్లు ఉన్నాయని నిరూపిస్తూ, పూర్వకాలమున గ్రీక్ దేశీయులకు భారతీయలకు గల సంబంధాలను వివరించాడు. వరాహమిహిరుడు వ్రాసిన బృహజ్జాతకంలో రాశి చక్రాన్ని వర్ణించే శ్లోకమిది.

"క్రియ తాబురు జితుమకుళీర
లేయ పాథేన జూకకార్పాఖ్యాః
తౌక్షిక ఆకోకేర హృద్రోగశ్చాంత్యభం చేత్థమ్ "

ఈ శ్లోకం లోని గ్రీక్ వివరణ ఇట్లున్నది. క్రియ (మేషం) తాబురి మి(వృషభం) జితుమ (మిధునం) కుళీర (కర్కటకం) లేయ (సింహం) పాథేన (కన్య) జూక (తుల) కౌర్పి (వృశ్చికం) తౌక్షిక(ధనుసు) ఆకోకేర (మకరం)హృద్రోగ (కుంభం) అంత్యభం (మీనం) పై పేర్లలో,కుళీర,హృద్రోగ, అంత్యభ అనునవి మాత్రం సంస్కృత పదాలు తక్కినవి గ్రీక్ భాషా పదాలు (సి.పి.బ్రౌన్. డా. కొత్తపల్లి వీరభద్రరావు పుట 380 - 390) పైవిషయాలే కాక తెలుగు, తెనుగు ఆంధ్ర శబ్దముల విచారం, తెలుగు దేశం ఎల్లలు, గ్రంధాంతంలో కాలిన్ మెకంజీ జీవిత చరిత్రను సంగ్రహంగా వ్రాశాడు. ఈ నాటి ఐతిహాసిక దృష్టితో చూసినపుడుఈ గ్రంధంలో కొన్ని లోపాలు కనిపిస్తాయి. అందుకు కారణం ఆనాటి విజ్ఞానం పరిమితం కావటమే.

## నిస్తర రత్నాకరము

ఇది క్రైస్తవ ధర్మాన్ని బోధించు పద్యకావ్యం. దీనిని బ్రౌన్ 1852 లో ముద్రించాడు. ఈ కావ్యంలో క్రైస్తవ ధర్మబోధతో పాటు హిందూమత దూషణమున్నట్లు గమనించి దానిని తొలగించి అచ్చువేశాడు. అపోస్తలు మతగురువులు విగ్రహారాధనను నిందింపకయే క్రైస్తవ మతమును బోధింపగా, ఆధునిక ప్రచారకులీ మర్యాదను ఏల పాటింపరు ? అని గట్టిగా ప్రశ్నించాడు. బ్రౌన్ పరమత సహిష్ణుతకు ఇదొక ఉదాహరణ.

సెంట్ లూక్ సువార్తను తెలుగు చేసి బ్రౌన్ 1838 లో ప్రచురించాడు. బైబిల్ ఆంధ్రానువాదంలో కూడా బ్రౌన్‌కు సంబంధముంది.

ఆంధ్ర భాషాసాహిత్యాల అభివృద్ధికి అపూర్వంగా కృషిచేసినంత మాత్రాన అతనికి క్రైస్తవ మతం పట్ల, తన దేశం పట్ల అభిమానం లేదని భావింపరాదు. అవన్నీ వ్యక్తి గత విషయాలు.

## తెలుగు వాచకం

వ్యాకరణం, ఛందస్సు, నిఘంటువుల తర్వాత తెలుగు నేర్చుకొనే పాశ్చాత్యులకు అత్యంత ఉపయుక్తమైన గ్రంధం బ్రౌన్ రచించిన తెలుగు వాచకం. ఇంగ్లీష్ నేర్చుకొనె స్వదేశ వాసులకు కూడా ఉపయోగపడేట్లు ఈ వాచకం వ్రాశాడు. మన దేశంలోనే కాక లండన్‌లో సివిల్ సర్వీస్ పరీక్షలకోసం తెలుగు నేర్చుకొను వారు దీనిని విధిగా చదివేవారు. దీనిలో మూడు భాగాలున్నాయి. మొదటిభాగంలో కథలు, ఉత్తరాలు, నేరవిచారణకు సంబంధించిన లిఖిత సామగ్రి-ఇవన్నీ వ్యావహారిక భాషలోనే ఉన్నాయి. రెండవ భాగంలో ఆంగ్లానువాదం, మూడవ భాగంలో వ్యాకరణాంశాలు,చిన్న నిఘంటువు ఉన్నాయి.

బ్రౌన్ ప్రజల భాషకు అంటే వ్యావహారిక భాషకు విశిష్టమైన స్థానం కల్పించాడు. తెలుగు వాచకంలోని ఒక కథ యిలా వ్రాయబడింది.

"ఒక దినము వొక బ్రాహ్మణుడు వొక వూరికి పోతూ వుండెను. అప్పుడు చాల యెండగా వుండెను. గనుక ఆ బ్రాహ్మణుడు మిక్కిలి అలసి దోవలో వొక తాటి చెట్టు కింద కూర్చుండి పాలు తాగుతూ వుండెను. అప్పుడు, అక్కడికి కాస్తదూరములో వున్న కొందరు బ్రాహ్మణులు అతణ్ణి చూసి యీ బ్రాహ్మణుడు తాటిచెట్టు క్రింద కూర్చుండి యేమి తాగినాడని విచారించగా, తాటిచెట్టులో కల్లు అవుతున్నది. బ్రాహ్మణుడు కల్లు త్రాగరాదు. ఈ బ్రాహ్మణుడు కల్లు తాగి నాడని దారిలో కొందరు చెప్పిరి. అంతట అందరున్ను అతణ్ని దూషించిరి. కాబట్టి చెడ్డ స్థలములో చేసిన మంచి పనులున్ను చెడ్డపనులు గానే యెంచబడును.(5 వ పేజి)

ఆంగ్ల సాహిత్య సంపర్కం వల్లనే తెలుగులో విరామ చిహ్నాలు వాడకం తెలుగు వారు చేర్చుకొన్నారు. మన తాళ పత్రాలలో విరామ చిహ్నాలెక్కడున్నాయి!

మన ఆచారాలను, సంప్రదాయాలను క్షుణ్ణంగా తెలుసుకొన్నవాడు బ్రౌన్. తెలుగు వాచకంలో ఆయన ముద్రించిన ఒక లేఖ లోని మొదటి భాగానికి ఇంగ్లీష్ అనువాదం యిది.

" Addressed to my mother Achamma sacred as the holy streams of Ganga and Bhagirathi (this mode of address is used to widows) your son Jatalkoti Kuppayya writes as follows (పుట 25)

వితంతువులను సంబోధించి వ్రాయునపుడు గంగా భాగీరథీ సమానులు అని వ్రాయటం మన సంప్రదాయం. దానిని బ్రౌన్ మరవ లేదు.

తెలుగు వాచకము తర్వాత ఇంగ్లీష్ వ్యాకరణాంశాలుగల అభ్యాసాలతో 'వాక్యా[illegible]' పుస్తకం వ్రాశాడు. పియర్సన్ రచించిన బెంగాలీ సంపుటాన్ని అనుసరించి దీనిని [illegible] 'తెలుగు-ఇంగ్లీష్ సంభాషణలు' తెలుగు పదజాలం గ్రహించటానికి మిక్కిలి ఉపయోగకరంగా వుంది. ఇది కన్నడం, తమిళ, ఒరియా భాషలలో కూడా అచ్చు వేయబడింది. (మద్రాసు - 1852)

ప్రభుత్వ పరీక్షలకు పాఠ్య గ్రంథాలుగా ఉన్న పుస్తకాలన్నీ బ్రౌన్ రచించినవే - ఆనాడే కాదు, ఈనాడు కూడ తెలుగు నేర్చుకొనదలిచిన ఆంధ్రేతరులకు బ్రౌన్ పుస్తకాలు ఉపయోగపడేటంతగా మరే పుస్తకం ఉపయోగపడదు.

పై రచనలే కాక ప్రభుత్వంకోసం విద్యాలయాలకోసం వందల కొద్దీ పుటలను ఇంగ్లీష్ నుంచి అనువాదం చేశాడు. అవన్నీ తన ఉద్యోగ ధర్మంగా చేసిన రచనలన్నాడు.

బ్రౌన్ తన మాతృభాషపట్ల ఎక్కువ మక్కువ కలవాడు. ఎన్నో గద్య - పద్య రచనలు చేశాడు. అతని ఆంగ్ల కవిత ఒకటి.

## I AND MY CARPET BAG

1. I and my carpet bag strolling along the road
   Never inclin'd to lag, leisurely under the load

Over the hills we go and follow the foot path down
Into the valley below with the hedge rows turning brown
passing beside the brook
that runneth along by the mill
Pausing awhile to look
in the mill pond smooth and still
with a glance at the miller's abode
and a peep at his well fed nag
strolling along the road --- go I and my carpet bag.

5. Fades the last blush of the day
hush'd is the low of the kine
Over an old gate way
Swingeth an ancient sign
Pleasantly sounds the din
of labourers over their beer
Gladly we greet the inn
promising noble cheer
Hail mine host of the Lamb
into your house go we
savoury smokes the ham
fragrantly steams the tea
Dreams of the pleasant past
all forgotten the fag
Cradled to rest at last.... I and my carpet bag

(LITERARY AUTOBIOGRAPHY OF C.P. BROWN) - Page 118-119

ఆయన జీవించిన పందొమ్మిదోశతాబ్దం (ఇంచు మించుగా) ఆంగ్ల సాహిత్య చరిత్రలో చెప్పుకోదగినది. సమకాలీన కాల్పనిక కవుల రచనలన్నిటినీ ఆయన చదివాడు. బ్రౌన్ కొన్ని కవితలల్లాడు. తనకు తృప్తినివ్వని వాటిని తానే చించి పారేశాడు. నేడు లభ్యమవుతున్న "I And My Carpet Bag" కవిత 75 పంక్తులు కలది. ఆ కవితలోని మొదటి - చివరి పద్యాలివి.

## సాహిత్య జీవన చరిత్ర

మిత్రులు, అభిమానులు పదే పదే ఒత్తిడి చేయటం వల్ల బ్రౌన్ తన సాహిత్య జీవిత విశేషాలను సంగ్రహంగా వ్రాశాడు. తానేది చేసినా భారతీయుల కొరకే చేశానని ప్రకటించాడు. తాను ప్రచురించిన వాటిలో దోషములున్నట్లు కాల క్రమంలో తెలుసుకొన్నానన్నాడు. బ్రౌన్ వినయ శీలాన్ని అతని మాటల్లోనే చూడవచ్చు. "Pride, hypocricy and misrepresentation are the besetting sins of a man who writes an account of his own adventures. Looking over the statements now made I see too little humility; too much of an air of self satisfaction in narrating matters where in I had no reason to glory. Conscience tells me that, had I improved my leisure

and opportunities better I could have done much more than I have effected. (Literary Autobiography of C.P. Brown P. 77).

## 8. తెలుగు ప్రజలతో సంబంధం

బ్రౌన్ ఆంగ్లేయుడు. ధనసంపాదనమే ప్రధానంగా భారత దేశాన్ని పీల్చి పిప్పి చేయాలన్న సంకల్పంతో ఏర్పడిన ఈస్టిండియా కంపెనీ ఉద్యోగిగా మనదేశంలో అడుగు పెట్టాడు. సహోద్యోగులలో అత్యధికులు నీతి నియమాలు లేనివారు. అటువంటి పరిస్థితుల్లో కొంగలలో హంసలాగా వ్యవహరించిన కొందరు కంపెనీ ఉద్యోగులులేక పోలేదు. ఆ కొందరిలో తెలుగువారి దేవుడుగా అభినుతింపబడినవాడు బ్రౌన్.

"తెలుగు వాళ్ళతో సత్సంబంధాలు పెట్టుకొని, వీలైనంత సానుభూతి తో సహానుభూతితో సమకాలీన తెలుగు ప్రజా జీవితంలో సంలీనమై, దానితో తాదాత్మ్యం చెంది తెలుగు ప్రజల గుండెల 'లబ్‌డబ్' ధ్వనుల్ని పరిశీలించి పోయిన 'సాహిత్య శాస్త్రజ్ఞుడు' బ్రౌన్. అంతేకాదు తెలుగు జన జీవితంలో నుంచి జీవితాన్ని దర్శించి అవగాహనకు తెచ్చుకొని, మనకొక అవగాహనను ప్రసాదించిపోయిన 'సారస్వత మూర్తి' బ్రౌన్. (బంగోరె)

ఉద్యోగ ధర్మాన్ని అనుసరించి బ్రౌన్ కడప, మచిలీపట్నం,రాజమండ్రి,కంబం, గుంటూరు మద్రాసు వంటి నగరాలలో పనిచేశాడు. ఉద్యోగరీత్యా తెలుగు ప్రజలతో పరిచయం ఏర్పడింది. తన పండితులతోను తాను నమ్మినవారితో తప్ప తక్కిన ప్రజా సామాన్యంతో సన్నిహిత సంబంధాలను కావాలనే పెట్టుకోలేదని స్వయంగా వ్రాసుకొన్నాడు బ్రౌన్. కాని ప్రజల విషయంలో సానుభూతి ఉండేది.

"The Telugus are a people quite as highly civilized as any in Europe; occasionally their modes of speech resemble those of Italy. " (A grammar of Telugu Language C.P. Brown Second Edition 1857 page 165)

బ్రౌన్ దగ్గర న్యాయము దొరకును_ అన్న నమ్మకం ప్రజలలో ఉండేది. అర్తులెందరో అతనికి తమ కష్టాలను ఎరుక పరుస్తూ జాబులు వ్రాసేవారు. జాబులు వ్రాసిన వారిలో పండితులు, పామరులు కంపెనీ కొలువులోని తెలుగు వారు, చిన్న వ్యాపారులు, యాచకులు మొదలైన వారెందరో ఉన్నారు.

"మమ్ము మీరు వ్రాయించుచున్న తెలుగు పుస్తకముల ప్రతులను వ్రాయనిండు" అనేవారున్నారు.

"గ్రామములలో తిరిగి గ్రంథములను సంపాదించు పనిలో మమ్ములను నియోగింపుడు" అనికోరినవారున్నారు. "మీరు తలచుకొన్నచో నాకు వివాహమగును. అని వ్రాసిన వారు కూడా ఉన్నారు.

ఏనుమ్మృతుండనౌదునని యింతభయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల మానవ కోట్లకు చావు నిక్కమౌ
గాన హరిందలంపుమిక గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! చెందెదవు మాధవలోక నివాస సౌఖ్యముల్ "

ఈ విన్నపాన్ని బ్రౌన్‌మన్నించాడో లేదో తెలియదు గాని, నాటి ప్రజలపట్ల అయనకున్న అత్మీయతను ఈ విన్నపం, తెలుపుతుంది. తెలుగు రీడర్‌లో పై విన్నపంలోని కన్యాశుల్కాన్ని గురించి క్రింది 'నోట్' వ్రాశాడు.

"....the more daughters a man has, the better off he is, as there is always a rapid demand for them; but to get a son married is difficult and costs large sum. A widower finds the difficulty greater " (Telugu Reader Second Edition 1865 page 122)

తమ కష్ట సుఖాలేకాక గృహచ్ఛిద్రాలను కూడా బ్రౌన్‌కు లేఖల ద్వారా తెలుపుతూ అతని సమాధానాలకు ఎదురు చూసేవారు. ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలవారు "బ్రౌన్ తమ జిల్లాలకు ఎప్పుడు ఉద్యోగిగా వచ్చునా, ఎప్పుడాయనకు పెద్ద ఉద్యోగమగునా, ఆశ్రితులకు ఉపకారములు జరుగునా, అని నిరీక్షించెడివారన్నచో అయన యందు తెలుగు ప్రజలకు ఎంతటి ఆదరాభిమానములు గలవో తెలియును".

అవినీతి పరులైన క్రింది ఉద్యోగులు బ్రౌన్ పేరు విన్నంతనే అదిరి పడేవారు. ఆయన పేరు చెప్పినంతనే తాము తీసుకొన్న లంచం మొత్తము తిరిగి ఇచ్చేవారు. మట్టపల్లి భగవానులు అనే గుంటూరు వ్యాపారి తనను చిన్న ఉద్యోగులు లంచం కొరకు వేధించే విషయం అర్జీ మూలంగా బ్రౌన్‌కు ఈ విధంగా వ్రాసుకొన్నాడు.

"యిప్పుడు పేష్కారు నన్ను వర్తకము చేసుకోకుండా సకల నిర్బంధములు పెట్టుతూ, నిర్హేతుకముగా నా దగ్గిర వొక అర్ధరూపాయి కూడా అపరాధము పుచ్చుకొని, తమరు విజయము చేస్తారని తెలిశి, నిన్న ఆ అర్ధరూపాయి మళ్లీ నాకు యిచ్చివేసినాడు" (తెలుగు రీడర్ పుట 152)

"పాండిత్యం గల వారంతా సహృదయులు కాలేరు. అలాగే సహృదయులూ విద్వాంసులు కాలేరు. కాని బ్రౌన్‌లో పాండిత్యమూ సహృదయతా జంటకవులై పొరపొచ్చెములు లేకుండా, క్షీరోదకాలవలె కలిసి మెలిసి వుండటం గొప్ప విషయం. పాండిత్యం అయనకు పండిత లోకంలో పెద్దపీట వేస్తే, సహృదయత్వం అయనకు ప్రజాహృదయంలో పట్టు పరుపు పరిచింది. సహృదయత్వం లోపించిన పాండిత్యం నిర్గంధకుసుమం. ఈ దృష్టితో చూస్తే బ్రౌన్ సమున్నతుడైన వ్యక్తిగా, మూర్తీభవించిన ఔదార్యంగా, రూపుదాల్చిన సౌజన్యంగా దర్శనమిస్తాడు. (సి.పి.బ్రౌన్ సాహితీ సేవ డా. చల్లారాధాకృష్ణ శర్మ)

తన కృషిలో సహాయపడుతున్నవారి పట్ల బ్రౌన్ ఎంతో ఆదరం చూపేవాడు. జీతం రూపంలో, గ్రంథసేకరణ విషయంలో, ముద్రణవిషయంలో బ్రౌన్ వారికి సహాయమంద జేసేవాడు. తన పలుకుబడిని ఉపయోగించి తోడ్పడేవాడు.

"బ్రౌన్ పండిత పక్షపాతి. వారి దుస్థితికి విచారించేవాడు. మనం మన సేవకులకు ఇచ్చునంతటి తక్కువ జీతమునకు కూడా పండితులు లభింతురు." అన్నమాటలలో బ్రౌన్‌కు పండితులపట్ల గౌరవం లేదని కాదు. ఈ మాటలు ఆనాటి పండితుల ఆర్థిక స్థితిని తెలుపుటకు ఆయన అలా వ్రాశాడు. అందువల్లనే పండితులకు ఆయన 'దేవుడు'అయినాడు.

సాంఘిక దురాచారాలను రూపుమాపుటలో కూడా బ్రౌన్ శ్రద్ధ వహించాడు. 1828 ప్రాంతాల్లో బ్రౌన్ కడపలో పనిచేస్తుండేవాడు. కడప సమీపంలోని ఒక బ్రాహ్మణ కుటుంబంలో 'సహగమనం' జరగబోతున్నట్లు విన్నాడు. స్వయంగా శ్మశాన వాటికకు వెళ్ళి తన ఎదుటనే శవదహనం జరిపించి ఒక స్త్రీ ప్రాణాలను కాపాడాడు. సమకాలీనులైన కొందరు పాశ్చాత్య లవలె భారతీయులను విమర్శింపనివాడు బ్రౌన్. తెలుగు జిల్లాలలో ఇది చాల తక్కువ అన్నాడు. suttee - prevented - Asiatic Journal, London 1828)

## కడపతో అనుబంధం

మూడేళ్ళపాటు మద్రాసులో ఉద్యోగ శిక్షణ తర్వాత బ్రౌన్ 1820 ఆగస్ట్ 19, 20 తేదీల్లో కడప కలెక్టర్‌కు అసిస్టెంటుగా కడపలో కాలు మోపాడు. ఆనాటి పరిస్థితులను గురించి బ్రౌన్ స్వీయ చరిత్రలో ఇలా వ్రాసుకొన్నాడు.

"I was then sent to the cuddapa (kadapa) district, where I presided in a police office for two years; all the work being carried on in Telugu Kannada, marata or Hindustani. Mr. Hanbury under whom I served, talked telugu fluently and impelled by zeal as well a necessity, in two years I equalled him. I soon acquired the colloquial Telugu; not to speak it well, but better than my neighbours; for as that day no Englishman had ever studied Telugu thoroughly. Some few had a name as good scholars ., but their skill was far from great.

In my leisure hours, while at cadapa, I read Greek, Hebrew and Persian. I carefully studied the Holy scriptures,.... I did not study Telugu though I daily corresponded in it by means of an amanuensis on matters of business. (Literary Autobiography of C.P. Brown page 31)

బ్రౌన్ ఉద్యోగరీత్యా 1820-22 లో ఒక సారి 1826-29 లో మరోసారి, దాదాపు అయిదేళ్ళు కడపలో ఉన్నాడు. అప్పటి మద్రాసు ప్రాంతంలోని ఎన్నో చోట్ల ఉద్యోగం చసినా, తెలుగు సాహిత్యానికి ఆటపట్టయిన కడపలో సువ్యవస్థిమైన సాహిత్య కర్మాగారాన్ని నెలకొల్పాడు.

కడపలో రెండోసారి పనిచేసినప్పుడు (1828) బంగళా - తోటను కొన్నాడు. బ్రౌన్‌కు అత్యంత విశ్వాసపాత్రుడైన అయోధ్యాపురం కృష్ణారెడ్డి ఇచ్చిన లెక్కల ప్రకారం బ్రౌన్ ఆ బంగళా తోటను వేయి పరహాలు అంటే 3 వేల 5 వందల రూపాయలకు కొన్నాడు

బ్రౌన్ ఎక్కడ ఉన్నా బంగళా తోట ఆస్తిపాస్తులు, సాహిత్య సంబంధమైన పనులు మొదలైన వాటిని గురించి జాబులద్వారా తెలుసుకొనేవాడు. తెలుగు సాహిత్య సముద్ధరణ మహాయజ్ఞం జరిపిన ఆ బంగళాను 'బ్రౌన్ కాలేజ్' అని పిలిచేవారు. కడపలో ఆయన ఏర్పాటు చేసుకొన్న సాహిత్య కర్మాగారం గురించి కడప జాబులలోని కొన్ని లెక్కలుః

"కాగితాల శిక్సెనులు దస్తాలు 21, మేలు తరహా రూలు వేశ్నిశికసనులు 160 దస్తాలు చీనా కాగితాల కట్టలు, యర్రఅట్టలు మొదలైన బైండింగ్ సామానులు బంగారు అక్షరాలుగల జీలు కట్టిన యర్రతోలు, యర్రగుడ్డ దస్త్రాలు, కాగితపు సంచులు, పేనాల కట్టలు 196, పేనా కత్తులు, కరక్కాయ సీరా యిట్లా యెన్ని సామాన్లు యెంత సరంజామా కడప కార్ఖానాకు యెన్నిసార్లు పంపించాడో, అన్ని పేనాలతో యెన్ని కావ్యాలు వ్రాయవచ్చునే అన్ని కావ్యాలకూ శుద్ధప్రతులు, వ్యాఖ్యానాలు, లఘుటీకలు వ్రాయించినట్లున్నాడు. కడపలో మహాభారతం మొదలు వేమన పద్యాలదాకా, అహల్యా సంక్రందనం నుంచి భానుమద్విజయం, చంద్రాంగద చరిత్ర దాకా యే వొక్క కావ్యాన్నీ వదలినట్లు లేదు."

కడపలో బ్రౌన్ ఏర్పాటు చేసుకొన్న గ్రంథాలయానికి అయోధ్యాపురం కృష్ణారెడ్డి ఒక ఆదర్శ గ్రంథపాలకుడుగ ఉంటూ బ్రౌన్‌కు అన్ని విధాలా అండగా వున్నందువల్లనే In these plans the zealous writer of this letter was a most noble and excellent assistant అని బ్రౌన్ అతనిని కొనియాడాడు.

తాటాకుల్లో శిథిలమైపోతూ కొన ఊపిరితో కొట్టు మిట్టాడుతున్న పెక్కు తెలుగు కావ్యాలను కాల గర్భంలో కలిసి పోకుండా పునరుద్ధరించిన యజ్ఞ కార్యానికి వేదిక కడపలోని బ్రౌన్ కాలేజి. ఈ మహత్కార్యం సాధించటంలో కడపలో బ్రౌన్‌కు సన్నిహితంగా పనిచేసిన పండితులలో ములపాక బుచ్చయ్య శాస్త్రి, రావిపాటి గురుమూర్తిశాస్త్రి, జూలూరు అప్పయ్య, ధర్మపురం సుబ్బన్న, వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రి, గరిమెళ్ళ వెంకయ్య ప్రధానంగా పేర్కొనదగినవారు. ఈ పండితులతో పాటు బ్రౌన్‌కు అత్యంత ప్రీతిపాత్రుడు, సేవ్య సేవక సంబంధానికి అతీతమైన ఉదాత్తచిత్తంతో పనిచేసిన నిజాయితీ పరుడు అయోధ్యాపురం కృష్ణారెడ్డి.

తెలుగు తాళ పత్ర గ్రంథాలను వివిధ ప్రదేశాల నుంచి తెప్పించుకొని, వాటిని కాగితాల మీదికి ఎక్కించి పరిష్కరింపజేసి, శుద్ధ ప్రతులను తయారు చేయించి అచ్చుకు సిద్ధంగా వ్యాఖ్యానాలు, టీకలు తయారు చేయించడం కడపలోని 'బ్రౌన్ కాలేజి'లో నిత్యమూ జరుగుతూ ఉన్న సాహిత్య వ్యవసాయం.

తెలుగు ప్రబంధాలలో అత్యంత జన ప్రియములైన మనుచరిత్ర, వసుచరిత్ర లను మొట్టమొదట వ్యాఖ్యానాలతో అచ్చువేయించిన యశస్సు బ్రౌన్‌కే చెల్లుతుంది. కడప జిల్లా నంగలూరుకు చెందిన ములుపాక బుచ్చయ్య శాస్త్రికి కడపలోని తన బంగళాలో కొలువు ఏర్పాటు చేసి 1829-30 లో వసుచరిత్రకు వ్యాఖ్యానం తయారు చేయించాడు బుచ్చయ్య శాస్త్రి పండితుడే కాక వేంకటేశ్వర మాహాత్మ్యం, మాఘమాహాత్మ్యం వంటి కావ్యాలను రచించిన వాడు చార్లీన్ ఫిలిప్పు ప్రవున్విపులాధినాథ కరుణా కటాక్ష లబ్ధ విభవ వి శయుడ" నని చెప్పుకొన్నాడు.

వసుచరిత్ర వ్యాఖ్యానానికి పీఠికా ప్రాయంగా బ్రౌన్‌ను ప్రశంసిస్తూ పదిహేను పద్యా బ్రాశాడు.

తే.గీ : వారిలో నింగిలీషు సద్వంశవార్ధి
బుట్టె దేవిడ్డు విద్యాభిభూత గీష్ప
తి ప్రభావుడు సకల దిగ్దేశ విదిత
విమల చరితుడు సతత సద్వృత్తి పరుడు
సీ॥ అతనికి బుట్టె సన్నుత దివ్య శుభమూర్తి
సకల లక్షణ శాస్త్ర చక్రవర్తి
పారిషీ ముఖమహాభాషా పరిష్కార
కరవాక్యవిస్ఫూర్తి సరసవృత్తి
సర్వతంత్రార్థప్రసంగ సంగతబుద్ధి
శబ్దశాసన సూత్ర సహితవృత్తి
లక్ష్య లక్షణ గురు లఘువర్ణగణ వార్తి
కావృత్తి విద్యన్మతానువర్తి
కల్పకాబ్దేందు దుగ్ధ సాగర దధీచి
కర్ణ బలికామ ధుక్కల్ప ఘనవితర్ది
కలిత పంకరుహ హ్పాత ఘన జనార్తి
వృజన కర్మనివృత్తి సద్వినుతకీర్తి

అయిన బ్రౌని
"నను బిలిచి పలికె విద్య
జ్ఞనములు నుతియింపనీవు సరళోక్తులచే
ఘనమైన వసుచరిత్రకు
మనమారగటీకచేయు మా మహివెలయన్

అన్నాడని బుచ్చయ్యశాస్త్రి చెప్పుకొన్నాడు. అందలి పద్యాల్లో బహుళ వ్యాప్తి గలదీ క్రింది పద్యం.

"మూర్ఖు లెక్కసేయక
పేర్గందిన విబుధజనుల బిలిపించుచువే
మార్గమిచ్చు వితరణి
ధార్మిసు ఫిలిప్సు బ్రౌను సాహెబు కరుణన్"

ఈ విధంగా పొగడ్తలను కుప్పించి కవిత్వకైవారాలు సమర్పించినా, బ్రౌన్ బుచ్చయ్య శాస్త్రి వ్యాఖ్యానాన్ని తిరస్కరించాడు. సామాన్యులకు సైతం అర్థమయ్యే విధంగా జూలూరు అప్పయ్యశాస్త్రి చేత మరో వ్యాఖ్యానాన్ని వ్రాయించి దానినే అచ్చు వేయించిన గుణ పక్షపాతి బ్రౌన్.

కడపలో ఉన్నపుడే (1825) తెలుగు భారతాన్ని చదువ నారంభించాడు. అప్పట్లో అయిన వేతనం రూ. 500 మాత్రమే. అయినా మహాభారతం శుద్ధ ప్రతి తయారు చేసేందుకు 2714 రూపాయిలు ఖర్చు చేశాడంటే అయిదు నెలల కష్టార్జితాన్ని ఈ పనికి వ్యయంచేశాడన్నమాట.

ధరణిదేవుల రామన్న వ్రాసిన దశావతార చరిత్రలోని అహల్యా కథాభాగాన్ని విడిగా వ్రాయించి అహల్యా సంక్రందనం అన్న పేరుతో అందలి పద్యాలను ఇంగ్లీష్ లోనికి అనువదించాడు. ఇక్కడున్నపుడే (1827 లో) హైందవ శిల్ప శాస్త్ర మందలి 'సమ విభక్తావయవ పద్ధతి' ని గురించి వ్యాసం వ్రాశాడు.

ప్రజల నాలుకపై నడయాడే పలుకుబళ్ళను, సామెతలను, చాటువులను కొల్లగా సేకరించాడు బ్రౌన్. భాషాశాస్త్రంలో కూడా బ్రౌన్‌కెంతో అభిరుచి ఉండేదనటాన్ని అతని కడప జాబులు నిరూపిస్తున్నాయి.

కడప జాబుల్లో ఒక చోట - వసారాలో గచ్చు గుంటలుపడి... అనే మామూలు వాక్యం అతని కంటపడింది. అంతే 'గుంట' గుంత అనే మాండలిక పద మీమాంసలో పడినాడు.
"కన్నులు గుంటలు పడ్డవి.. His eyes are sunken, గాలి గుంట, Vema 1647 - shower of dust, a whirl wind...(వసారా లో గచ్చు గుంటలు పడి the plaster has broken, there are breaches in the wall sic (NB) This is the Cuddapah spelling -in the north the word is గుంత (ఇక్కడ జాబులో గుంతలు పడి అనే కాపీ చేయబడివుంది. బహుశా కృష్ణారెడ్డి గుంటలు పడి అని జాబులో వ్రాసుంటే దాన్ని కాపీచేసిన వుత్తరాది వ్రాయసకాడు. తన మామూలు వాడిక ప్రకారం గుంతలు పడి అని వ్రాశాడనుకోవాలి) (బ్రౌన్ జాబులు - స్థానిక చరిత్ర - బంగోరె పుట - 88)

'పలుగురాయి' అనే పదానికి అర్థం చెప్పుకోవడంలో నన్నయ వ్రాసిన పద్యాన్నే శిరోధార్యంగా భావించి తృప్తి చెందలేదు. కడప జిల్లా బద్వేలు తాలుకాలో పలుగురాళ్ళపల్లె అనే వూరుంటే అక్కడికి వెళ్లిస్వయంగా అక్కడి రాళ్ళు చూచి అర్థాన్ని నిర్ధారణ చేసుకొన్నాను. భారతం (సభాపర్వం) లో వచ్చే 'పలుగురాల కుడ్యముల రుచులో' అనే పద్యంలో గల అర్థమేమిటో యెరుకకు తెచ్చుకొన్నాడు. (అదే - పుట 89)

"పలుగురాళ్లు R.S. is rendered సన్నపాటి మెరపరాళ్లు i.e. gravel but I believe this is wrong. I have visited a village named పలుగురాల పల్లె in the cuddapah District (in the year 1827) and observed that the place was full of white marble slabs."

కరడు ః Redness of clouds, a lurid glare. This sense I ascertain distinctly in 1838 from a cuddapah Taluq (SIC) who said కొరడు was a rainbow being a distinct word.
గాబము ః knot grass infests fields of dry grain. Cuddapah dialect for గాదము.

బ్రౌన్ ఎన్నో చాటువులను సేకరించాడు. కడప మండలానికి సంబంధించిన **ఒకటి రెండు** చాటు ధార పద్యాలు. (బ్రౌన్ జాబులు - స్థానిక చరిత్రశకలాలు - పుట 90 - **బంగోరె)**

"వంటి మిట్ట అనే వూరిలో కవి పాపరాజు సిద్ధిసాని అనే భోగందానిని **ఆశీర్వాదం చేసిన** సంగతిని గురించి పుట్టిన పద్యం -

తే॥గీ॥ ఒంటిమిట్టను కాపురంబున్నయట్టి
సిద్ధిసానికి సంకల్పసిద్ధిరస్తు -

ఆమె యిందుకు మారుచెప్పిన దేమంటే :

చెలగి నా మీద పద్యంబు జెప్పినట్టి
పాపరాజుకు మైధున ప్రాప్తిరస్తు "

మరొకటి : "an Epigram written by నక్కలపాటి బాల సరస్వతి against the hea farmer of cuddapah says :

ఉ॥ రెడ్లమటంచు క్రొవ్వున చరించి వరాలు
గడించి యూరకే
బుడ్లకొలంది నించి కడుపుల్కడుబెంచి
వివేక శూన్యులై
యెడ్లవలెన్ చరించు గుణహీనులకెక్కడి
కీర్తులోరి వి
ద్వేడ్లయ కాల గోళ్ళ చిన తిమ్మతనూభవ
తాతభూవరా!

తన తిరుగుళ్ళతో, బదలీలతో ఎట్టి అవరోధాలు లేకుండా తాను తలపెట్టిన సాహిత్య కార్యక్రమాలు నిరాఘాటంగా సాగి పోయేందుకు కడపలో బంగళా తోటను కొన్నాడు బ్రౌన్.

"ఈ బంగళాలో వొకమూల గదిలో చిన్న సాహిత్య కర్మాగారంలా వొకటి పనిచేస్తూ, పండితులు తాళపత్రపత్రులు ముందరేసుకొని శుద్ధప్రతులు తయారు చేస్తూ వ్యాఖ్యానాలు కూరుస్తుండేవారు. నిలవనీడలేకుండా పోయిన తెలుగు కావ్య సరస్వతిని ఆహ్వానించి తన బంగళాలో వొక సాహిత్య పర్ణశాల యేర్పరచి ఆ వాగ్దేవి నిండు ముత్తయిదులాగా నడయాడేలా చేయగలిగాడు బ్రౌన్."

"మరోమూల వొక చిన్న పాఠశాల (ములుపాక బుచ్చయ్య మాటల్లో 'పాఠకశాల) నడుస్తూ వుండేది. "బహుమంది విద్యార్థులు .... నేను తమరు సుకృతంగా పాఠకశాల బెట్టి అనేకమందికి ఆంధ్ర గీర్వాణ కావ్య నాటకాలంకారాది గ్రంధములు అభ్యసింప చేస్తూ వున్నాను." అని బుచ్చయ్య శాస్త్రి ఒక జాబులో వ్రాశాడు. కడప జాబుల్లో బ్రౌన్‌కు సంబంధించిన ముఖ్య విషయాలను పేర్కొనటం సమంజసం.

**"సేద్యం"** తన బంగళా - తోటలో రక రకాల చెట్లు చేమలు - సన్నచెట్లు - లావు చెట్లు వేసి వ్యవసాయం చేయించేవాడు. వీటి సేద్యం - గిద్యం కాపుదల విషయమై సేద్యగాళ్ళు రఘువాలీలు, యెద్దులు, యేతాలు - ఇట్లా పెద్ద తతంగమే వుండేది. ఈ తోటల్లో ద్రాక్ష చెట్లు బాగనే కాపు కాస్తుండేవనుకోవాలి.

యాభై ఏళ్ళు వచ్చేసరికి బ్రౌన్ మద్యపానం మానివేశాడు. అవివాహితుడు. ఎల్ల వేళలా సాహిత్య వ్యాసంగమే కాకుండా వేటలు వినోదాల్లో కాలక్షేపం చేసేవాడు.

**ఇల్లేకాలేజి :** ఎక్కడున్నా తన ఇంటిని 'కాలేజి' అని పిలిచేవారని స్వీయచరిత్రలో బ్రౌన్ వ్రాసుకొన్నాడు.

"....and I saved no money indeed there were always from ten to twenty Brahmans and sudras in my pay; employed in transcribing native authors, in preparing correct editions in framing indexes and commentaries ... thus there were three separate sets of Brahmans engaged under my roof which people called "Brown's College".

"తన ఇంట్లో ఎపుడూ అంతమంది పండితులకు పన్ను కట్టించి తెలుగు సాహిత్య సముద్ధరణ మహా యజ్ఞాన్ని జరిపిస్తూ వుండేవాడు. కాబట్టి, తెలుగు విద్య దేదీప్యమానంగా వెలుగొందుతూ తెలుగు శారద గజ్జెల గలగలలు వీనుల విందు చేస్తుండబట్టి ఆ బంగళాను ఆ రోజుల్లో ఒక కాలేజి అనడంలో ఆశ్చర్యమేముంది. ? (బంగారె - బ్రౌన్ జాబులు - స్థానిక చరిత్ర పుట 95)

**అప్పులు — ఆర్థిక విషయాలు :** తన ఆర్థిక స్థితిగతులను గురించి బ్రౌన్ ఆత్మ కథలో ఒక్క చోట యిలా వ్రాసుకొన్నాడు.

"four or five years I had lived in a very humble style, giving every farthing to pay first my brahmans and secondly my debts. Even when in the greatest difficulties I gave from two to three hundred rupees a month to my book schemes.

వచ్చే వేతనం చాలక అప్పులు తెచ్చి సాహిత్యోద్ధరణ చేశాడు. వ్యక్తిగతములైన విషయాలను కూడ కృష్ణారెడ్డి జాబులలో వ్రాసేవాడు.

'వేబళరావు దగ్గర " తమరు రెండు మూడు మారులు అయివజు తీసుకొని పత్రాలు వ్రాశి యిచ్చి వున్నారు." ఒకరి అప్పు తీర్చడానికి మరొకరి దగ్గర అప్పు చేసేవాడు. మాణిక్య మొదలారి అప్పు తీర్చడానికి గజ్జెలరెడ్డి వద్ద అప్పు చేశాడు.

**జీతభత్యాలు :** ఉద్యోగం చివరి దశలో వేల రూపాయలు జీతం వచ్చినా, తెలుగు సాహిత్యకార్యక్రమాలకు అంకురార్పణ చేసిన కాలంలో బ్రౌన్ జీతం వందల్లోనే ఉండేది. వేమన పద్యాల సేకరణ తర్వాత మహాభారత అధ్యయనానికి పూనుకొన్న సమయం (1825) లో బ్రౌన్ వేతనం రు 262 $^1/_2$ మాత్రమే. జీతం కాక ఇంటి అద్దె అలవెన్స్ 35 రూపాయలు, సంచారకాలం లో రోజుకు అదనంగా 2 రూపాయలు 10 అణాలు డేరా అలవెన్సు వచ్చేది పై భత్యాలేకాక ప్రభుత్వ భూములపైన వచ్చే శిస్తు గిస్తు-ఆదాయాల్లో నుంచి, ఫసలీకి ఇంతశాతం అని కొంత కమిషన్ కూడ వచ్చేది. 1826 జనవరి నాటికి అలవెన్సులన్నీ చేరి జీతం నెలకు 525 రూపాయలు వచ్చేది.

కడప జాబులను పరిశీలించినపుడు బ్రౌన్ కొక్క పెద్ద గ్రంథ భాండాగారం ఉన్నట్లు

తెలుస్తుంది. ఆ కాలంలో పబ్లిక్ గ్రంథాలయాలు లేవు. పందొమ్మిదో శతాబ్దంలో సంపన్న గృహస్థుల భవనాలలోను సంస్కార వంతుల గృహాలలోను గ్రంథాలయాలుండేవి. ఎవరెవరి దగ్గర గ్రంథాలున్నాయన్న విషయాన్ని తనకు తెలిసినంతవరకు వ్రాసి పెట్టాడు. "కడపలో గజ్జెల రెడ్డి వద్ద గ్రంథాలున్నాయి. పాత కడపలో ఉన్న చించోలి అప్పణాచార్యుల వద్ద చాల ఘనమైన సంస్కృత గ్రంథ సంచయనం వున్నది.

"నొస్సంలో (ప్రస్తుతం కర్నూలు జిల్లా) ఉండే రంగారెడ్డి గారి సంస్థానంలో గొప్ప పుస్తకశాల వున్నది."

"దువ్వూరు తాలూకా (ప్రస్తుతం కడపజిల్లా) లోని పల్లపాడులోని రాఘవాచార్యులుగారి కుమారుడు యోగ్యుడు. అతని వద్ద శానా గ్రంథాలున్నాయి." "నెల్లూరుకు సమీపాన వల్లపూడి లోని గోపరాజు సుబ్బయ్య ఇంకొక గట్టి విద్వాంసుడు. ఈయనే దశావతార చరిత్రను నా వద్దకు తెచ్చి యిచ్చాడు."

"చిత్తూరుకు దక్షిణాన కంబానికి సమీపాన వున్న మొగళ్లూరు వాస్తవ్యుడు కొండూరు చిదంబరం నాకొక బండెడు గ్రంథాల రాశి ఇచ్చాడు. కోవెలకుంట్ల శివార్ల అవుకు లోని అక్షింతల సుబ్బరాయ శాస్త్రి బెంగాలులో ముప్పయి సంవత్సరాలు వాసం చేశారు. ఆయన బెంగాలీ భాష క్షుణ్ణంగా తెలిసిన విద్వాంసుడు."

"దువ్వూరు గుడిపాడు (కడపజిల్లా) లోని కరణం లక్ష్మీపతి ఇంట్లో చక్కని గ్రంథరాశి వుంది. కంబంలోని నాగిరెడ్డిపల్లె వాస్తవ్యుడు వంగీపురం వెంకట కృష్ణమాచార్యులు ముప్పయి రెండేళ్ళ వయస్సు. శానా నిరాడంబరుడు. చక్కని విద్వాంసుడు, కవి

"కంబానికి (అప్పట్లో కడపజిల్లాలోనిది) మూడామడల దూరంలో వున్న ఉయ్యాల వాడ గ్రామ కరణం మిడుతూరి లక్ష్మీ నరసుకు అతి శయమైన విద్వత్తు వుంది. అతడు కవిత్వం చెప్తాడు" "మంచాల కృష్ణమరాజు అప్పకవీయం లోని మూడు ఆశ్వాసాలను తీసుకొని వచ్చి నాకు ఇచ్చాడు. ఆ పద్యాలన్నీ ఆయనకు కంఠతా వచ్చును."

తాను ఎంత పెద్ద ఉద్యోగంలో వున్నా పుస్తక సంచయమున్న వారి ఇంటికి వెళ్ళి గ్రంథాలను పరిశీలించడానికి ఎంతదూరమైన వెళ్ళేందుకు సిద్ధంగా వుండేవాడు. కడపకు సంబంధించిన కొన్ని వ్యాసాలు వ్రాశాడు. కడప జిల్లా ప్రొద్దుటూరుకు చేరువుగా వున్న రామేశ్వరం గ్రామ కరణీకపు మిరాశీ వివాదాల నేపథ్యానికి రెండు సంపుటాల ఆంధ్రాంగ్ల గ్రంథం రచించాడు.

"బ్రౌన్ లోగడ మద్రాసు సదర్ అదాలత్ కోర్టు రిజిస్ట్రార్‌గాను, తెలుగు ట్రాన్స్‌లేటర్ గాను ఉన్నప్పుడు కడప ఫస్ట్ సెషన్సులో జరిగిన ఒక కేసు (క్యాలెండర్ నం 22) తీర్పును 1839 ఆగష్టు 5 న ఫౌజ్‌దారీ అదాలత్ కోర్టుకు పంపిన ఫైలు (వెంకట సుబ్బమ్మ అనే ఆమెను ఒక మంత్రగాడు తన ఇంట్లో చంపి వేసి ఆమె శవాన్ని ఏదో మంత్ర తంత్ర శక్తుల కోసం వినియోగించాలనుకొన్నాడు. ఆ శవాన్ని దరిమిలా ఒక దేవళంలో వ్రేలాడదీస్తాడు. -ఇదీ ఆ కేసు) లో నుంచి మంత్ర తంత్రాలను బ్రౌన్ ఇంగ్లీష్‌లోకి తర్జుమా చేసిన భాగాలను 'Telugu spells' అను పేరుతో (మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ - 1864 జులై - నెం III సిరీస్ లో ప్రకటిస్తారు. (బ్రౌన్ లేఖలు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ. పర్యవేక్షణ, ప్రొఫెసర్ జి.యన్.రెడ్డి-పరిశోధన బంగోరె - పుట 148)

భారతదేశంలో స్థలనామ పరిశోధనకు శ్రీకారం చుట్టిన వారు పాశ్చాత్యులు. దక్షిణ భారతదేశంలో మెకంజీ, బ్రాన్‌ఫిల్ కాల్డ్వెల్, సి.పి. బ్రౌన్ మొదలగు వారు స్థలనామాలను గురించిన వ్యాసాలు ప్రచురించారు. స్థలనామవిజ్ఞానం భాషాశాస్త్ర సంబంధమైనది. భాషా శాస్త్రంలో కూడా ఉదాహరణంగా కడప ఊరు పేరుకు సంబంధించిన ఒక పెద్ద నోట్ వ్రాసిపెట్టాడు బ్రౌన్. ఆ 'నోట్' యథాతథం గా ఇస్తున్నారు.

కడప : The town Cuddapah denotes a doorway, and the people there, fancy the town was so named because it is on the route to the holy city Tirupati తిరుపతి (Tripetty of the maps). Thus the city of Genoa in Italy was formally called Janna, as being this gate by which the Gauls entered గడప a threshold is the Root in A of గడచుట to pass: the passage or place of crossing. so in Hebrew .... other and in Arabic ... 'ober'. In some geographical dictionaries which copy the assertions made by sir charles wilkins we are assured that the name was Cripa, the sanscrit word for grace, favour. But this is a mistake, and arose thus: the Musulmans were unable to pronounce the hard D in Kadapa and charged it into the hard R calling it kurpa or kripa. It was thus affirm merely Kadapa a threshold; also pronounced Gadapa some natives fancy it was so called as being one way to shrine at Tirupati an etymon as absurd as that imagined for Genoa from Janua".

బ్రౌన్ కడప పేరును ఆంగ్లంలో Cuddapah అని వ్రాయటానికి ఇష్టపడక kadapa లేక cadapa అని వ్రాసేవాడు. While at cadapa I read Greek, Hebrew and persian అని స్వీయ చరిత్రలో వ్రాసుకొన్నాడు.

## 10. వ్యక్తి – వ్యక్తిత్వం

బ్రౌన్ ఆంగ్లేయుడు. కాని పుట్టింది ఇండియాలో. పెళ్ళి, పెళ్ళాం, పిల్లలు వంటి బాదర బందీ లేమీ లేకుండా రేయింబవళ్ళు తెలుగు భాషా సాహిత్యాలే తన ఊపిరిగా జీవించిన 'సారస్వత యోగి' బ్రౌన్.

సదా సర్వదా సాహిత్య చింతనా మత్తుడైనందువల్ల అతని ఆంగ్లమిత్రులు కొందరు తనను పిచ్చివాడని పరిహసించారని పేర్కొన్నాడు. At various times I have been considered (and by my self) as some what insane... Those who have known me intimately have judged me wholly sane".

మహత్తర లక్ష్యసాధనకోసం శ్రమించిన వాళ్ళనందరినీ సమాజం సాధారణంగా పిచ్చివాళ్లనే భావిస్తుంది. నిజంగానే బ్రౌన్‌కు తెలుగు పిచ్చిపట్టింది. గ్రీక్ లాటిన్, హీబ్రూ, ఫ్రెంచి, ఇటాలియన్, పర్షియన్, సంస్కృతం, ఆంధ్రం, ఆంగ్లం వంటి 24 భాషలలో పాండిత్యం గడించిన వాడాయన.

అయన వ్యక్తిగతంగా నైష్ఠికుడైన క్రైస్తవుడు. పాపభీతి, దైవభక్తి కలవాడు. ఏనాడు సబ్బాత్ నియమాన్ని ఉల్లంఘించలేదు. ఉదయం అయిదు గంటల నుంచి పది వరకు సాహిత్య కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. ఆదివారం పూర్తిగా విశ్రాంతి దినం. ఆ రోజు తమ నిఘంటు నిర్మాణం నిలుపుదల చేసేవాడు.

ఉద్యోగ విధులను ఏమాత్రం విస్మరించనివాడు. ఏ మాత్రం విరామం ఉన్నా భాషా సేవలో మునిగిపోయేవాడు. తీరిక లేదు అనటాన్ని విమర్శిస్తూ పనిలో కుతూహలం లేక పోవటమే అలసత్వానికి కారణం అనే వాడు.

"Want of leisure, so often lamented in India, usually denotes want of inclination; I have always had leisure".

హిందు శాస్త్రాలను బాగా అధ్యయనం చేసిన బ్రౌన్ హిందువుల ఆచార వ్యవహారాలలో కొన్నిటిని పూర్తిగా వ్యతిరేకించాడు. ఆయన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు. "కడచిన ముప్పయి సంవత్సరాలలో నేను ఎన్నడూ హిందువులతో మిళితం కాలేదు. వాళ్ళ పండుగలు పబ్బాలు పట్టించుకోలేదు. నా నౌఖరిలో పనిచేసేవాళ్ళు తప్పించి నాకు చాల తక్కువ మందితో పరిచయాలు వుండేవి. నన్ను వచ్చి కలుసుకొనే నేటివులు బహు అరుదు. నేను హిందూ మత విగ్రహారాధనను వ కట్టుకొని ప్రతిఘటిస్తానని చెప్పుకొనేవారు. బ్రాహ్మణులను విమర్శించే వేమన పద్యాలను ప్రచురించినందుకు, జంగాలను వెనకేసుకొని వచ్చినందుకు నా హైందవ వ్యతిరేకత రుజువు అయినదని భావించేవారు."

బ్రౌన్ హిందూ సమాజ సంప్రదాయాలలో ఏనాడూ జోక్యం కల్పించుకోలేదు. మత మతాచారాలను గౌరవించాడు. తెలుగు పిల్లల కోసం బళ్ళు స్థాపించిన బ్రౌన్ 1821లో కడపలో రెండు పాఠశాలలు 1823 లో మచిలీపట్నంలో రెండు, 1844లో మద్రాసులో ఒకటి, ఇలా ధర్మపాఠశాలలను ప్రారంభించాడు. వాటి నిర్వహణలో కొన్నిలోపాలు గోచరించిన కారణంగా వాటిని రెవరెండ్ క్రిస్టియన్ అరులపెన్ అనునతనికి బదలీచేశాడు.

బ్రౌన్‌కు అపారమైన భూతదయ,బీదలపట్ల సానుభూతి ఉండేది. నిరుద్యోగులెందరికో పని కల్పించి బీదలకు సహాయ పడినట్లు బ్రౌన్ జాబుల వల్ల స్పష్టమౌతున్నది.

తన సంపాదనలోని ప్రతి రూపాయికి పైసా వంతున దాన ధర్మాలకు కేటాయించాడు. ప్రతినెల కుంటి, గుడ్డి, అవిటి వాళ్ళకు అయిదు వందల దాకా ధర్మం చేసేవాడు. బిచ్చగాళ్లు కూడా బ్రౌన్‌కు .జాబులు వ్రాసేవారు.

ఒక మారు అప్పులు చేసికటకటాల పాలైన పదకొండుమందిని 355 రూపాయలిచ్చి విడిపించాడు. బ్రౌన్‌కు జైలు శిక్ష అంటే విపరీతమైన భయం. తన కొలువులోని ఒక ముస్లిం మున్షీకి వేయిరూపాయలిచ్చి ఆదుకొన్న దయామయుడు బ్రౌన్. అప్పుల బాధలతో సతమతమౌతున్నప్పటికీ తన ఆదాయంలో పైసా పైసా కూడబెట్టి పండితులకు వేతనాలిస్తు ఉండేవాడు. గ్రంథసేకరణ, పండిత పోషణ వంటి పథకాల కోసం అరవై వేలు అప్పు చేశాడు. అందులో సగం వడ్డీయే!!

ఒక ఆంగ్లవ్యాపారి వద్ద అప్పులు తీసుకొనేవాడు. అప్పు తీరేవరకు ప్రతినెల బాకీ క్రింద చెల్లిస్తుండేవాడు. వివిధ ధర్మ సంస్థలలో సభ్యుడుగా ఉండేవాడు. తన తండ్రి చనిపోయిన తర్వాత, తన తల్లి లండన్‌కు బిడ్డలతో వెళ్ళటానికి కలకత్తా లోని ఇవాంజెలికల్ చర్చి ఫండు నుంచి అప్పుగా తీసుకొన్న నాలుగు వేల రూపాయలను బ్రౌన్ తిరిగి చెల్లించాడు. ఆర్థికంగా కొంత పుంజుకొన్న తర్వాత అతిథి మర్యాదలు మళ్ళీ మొదలైనాయి. బ్రౌన్ ఖర్చు మనిషి.

మద్రాసులోని వేపరిలో లంకంత ఇంట్లో ఉండేవాడు. ఇంటిని అందమైన చలువరాతి విగ్రహాలతో అలంకరించాడు. ఇంగ్లీష్, ఫ్రెంచి, డచ్,ఇటాలియన్ ప్రకృతి దృశ్యాలున్న 70 తైలవర్ణ చిత్రాలు ఇతర చిత్రాలు రమణీయంగా ఉండేవి. రెండు స్వారీ బండ్లు, ఆరుగుర్రాలు మున్నగు వాటితో చివరి దశలో దర్జాగా జీవితం గడిపాడు. గవర్నర్ భవనం లో కన్నా మిన్నగా తన ఇంట షడ్రసోపేతమైన విందులు ఏర్పాటు చేయించేవాడు.

అతని సొంత గ్రంథాలయంలో ఇంగ్లీష్, ఫ్రెంచి, లాటిన్ మొదలైన భాషల గ్రంథాలు నాలుగువేలుండేవి. ఒక్క యూరప్ చరిత్రకు సంబంధించిన గ్రంథాలే నాలుగువందలుండేవి. ముప్పది మ్యాప్‌లు ఉండేవి. తెలుగు ప్రజల మన్ననలను కుప్ప తెప్పలుగా అందుకొన్న బ్రౌన్ ను కంపెనీ ఉన్నతాధికారులు గాని బోర్డు డైరక్టర్లు గాని సరిగా గౌరవించ లేదు. తెలుగు నేర్చుకొన్న ఆంగ్ల ఉద్యోగులకు బ్రౌన్ పట్ల అసూయ ఈర్ష్య ఉండేవి. బ్రౌన్‌కు సన్నిహితుడైన బిషప్ కాల్డ్వెల్ 'My restless Pandit Mr. Brown' అన్నాడు.

బ్రౌన్ మంచి ధారణాశక్తి కలవాడని , అనేక భాషలలోని కావ్య భాగాలను సులువుగా వల్లించేవాడని; పరిశోధనపట్ల అతనికున్న ఆసక్తి అపారమని కాల్డ్వెల్ అన్నాడు. అంతేకాదు. అతడు పనికిరాని పుస్తకాలను కూడా చదివేవాడని, శుష్కవాది, మొండిపట్టుదల కలవాడుగ వ్యవహరించేవాడని, చపల చిత్తుడు, వాగ్వాద ప్రియుడు అని కూడా అన్నాడు

ఇతరుల రచనలు తనకు నచ్చనప్పుడు తీవ్రంగా విమర్శించే ఈయన తత్వం చూస్తే "ధిషణాహంకార సంభార దోహల భాషార్ణవ మూర్తిగా" కనిపిస్తాడని బిషప్ కాల్డ్వెల్ అన్నాడు.

తనను గూర్చి ఇంకా కొన్ని వివరాలు కావాలని కోరినవారికి సమాధానంగా, ఇక చాలు, చెప్పవలసినదంతా చెప్పాను. యోగ్యులైన వారిని గురించి మనకు తెలిసిందెంతో తక్కువ. "I have said quite enough. How little we know of men more deserving!

బ్రౌన్ కారణ జన్ముడు. He was what is generally called self-taught, but I think he might with propriety have been termed God Almighty scholar అన్న అభియుక్తోక్తికి ఉదాహరణం బ్రౌన్.

# అనుబంధాలు

## 1. బ్రౌన్ పండిత మండలి

"ప్రాచీనాంధ్ర తాళపత్ర గ్రంథములు తైల సంస్కారము లేక గడ్డకట్టి పురుగులకు బువ్వయగుచున్న కాల మున యుద్ధవించి దేశమందెల్లెడల నిర్లక్ష్యముగా నిరాదరముగా పడియున్న తాళపత్రగ్రంథములను సేకరించి సంస్కరింపజేసి, కాగితాలపై ఎత్తి వ్రాయించి విపుల పాఠభేధ పరిశీలనము కావించి ముద్రించి భద్ర పరచిన కీర్తి బ్రౌన్ దొరగారిది" (డా॥ నిడదవోలు వేంకటరావు).

బ్రౌన్ తలపెట్టిన వాఙ్మయ మహాయజ్ఞమున లేఖకులుగ నౌకర్లుగ పండిత పరిశోధకులుగా తోడ్పడి తమ విజ్ఞానాన్ని ఆ మహాయజ్ఞమున అజ్య హెూమంవలె ధార పోసిన కవి పండితులకు మనం కృతజ్ఞతను ప్రకటించాలి.

**వెలగపూడి కోదండరామయ్య.** బ్రౌన్‌కు తెలుగు అక్షరాలు నేర్పిన కళాశాల పండితుడు. అక్షరాభ్యాసం చేయించిన గురువు. కనుక ఈయన ప్రాతః స్మరణీయుడు. గురువుగారి దయవల్ల బ్రౌన్‌కు వేదండమును (ఏనుగు) ఎక్కినంత కీర్తి లభించినది. కాలాంతరంలో బ్రౌన్ గురుదక్షిణగ కోదండ రామయ్య గారికి పోలీస్ హెడ్ అమీన్ ఉద్యోగ మిప్పించాడు.

**పర్యం అద్వైత బ్రహ్మశాస్త్రి.** బ్రౌన్ మచిలీపట్నంలో అసిస్టెంట్ జడ్జిగా ఉన్నప్పుడు ఈయన కోర్టు పండితుడైనాడు. (1833) గుంటూరు జిల్లా రేపల్లె తాలుకా కారుమూరు గ్రామ కాపురస్తుడు. ఈతని విద్యా వైదుష్యాలను గుర్తించి బ్రౌన్ ఇతని వద్ద వ్యాకరణం, ఛందస్సు నేర్చుకొన్నాడు. బ్రౌన్‌కు ఆప్తమిత్రుడు. లిఖిత ప్రతుల సేకరణలోను వివిధ భారతీయ గ్రంథాలను తెలుగు లిపిలో వ్రాయించి పంపించటంలో బ్రౌన్‌కు విశేషంగా తోడ్పడినాడు.

శబ్దార్థ నిర్ణయంలో గురుమూర్తి శాస్త్రి తో పాటు ఈ బ్రహ్మయ్యను కూడా బ్రౌన్ పరమ ప్రామాణికునిగా గ్రహించాడు. తారాశశాంక విజయ ప్రబంధాన్ని పరిష్కరించాడు. రేఫ రకారములను గురించిన గ్రంథం వ్రాశాడు. వసుచరిత్ర కావ్య ముద్రణ ఇతని పర్యవేక్షణలోనే ప్రారంభమైనది. ఈయన పెద్ద తమ్ముడైన సీతారామ శాస్త్రి, చిన్న తమ్ముడైన రామలింగ శాస్త్రి కూడా బ్రౌన్‌కు తోడ్పడినారు. బ్రహ్మయ్య బ్రౌన్ పై పెక్కు శ్లోకాలు పద్యాలు వ్రాశాడు. బ్రహ్మయ్యను రెండు చోట్ల బ్రౌన్ 'my very learned friend Brahmaya' అని పేర్కొన్నాడు.

**ములుపాక బుచ్చయ్య శాస్త్రి.** బ్రౌన్ ఇతనిని తన విద్యాగురువుగా పేర్కొన్నాడు. ఈయన కడప జిల్లా నందలూరుకు చెందిన వాడు. వేంకటేశ్వర మాహాత్మ్యం, మాఘం నుంచి ఒక పద్యాన్ని బ్రౌన్ ఆంధ్ర గీర్వాణచ్ఛందంలో ఉద్ధరించాడు. బుచ్చన్న (బ్రౌన్ సంబోధన) విష్ణుపురాణం, హంస వింశతి, భారతం, భాగవతం మొదలైన కావ్యాల పరిష్కరణలో తోడ్పడినాడు. ఈయన వసుచరిత్రకు వ్రాసిన వ్యాఖ్యానంలో "ఛార్లెస్ ఫిలిప్పు బ్రవున్వి పులాధి నాధ కరుణా కటాక్ష లబ్ధ విభవాత్మ, శయుడ "నని వ్రాసుకొన్నాడు.

ఇతని శైలి ప్రౌఢంగా ఉండటంవల్ల బ్రౌన్‌కు ఈయన రచించిన వసు చరిత్ర వ్యాఖ్య

నచ్చలేదు. సుప్రసిద్ధమైన "నూర్లార్లు లెక్క సేయక ...అన్న పద్యం ఈయన వ్రాసిందే.

**జూలూరి అప్పయ్య శాస్త్రి:** బ్రౌన్ కొలువులో ఉండిన ఉద్దండ పండితుడు. బ్రౌన్ Juluri Appaia; a poet and Grammarian; The learned author Zuluri Appayya sastri Zuluri Appayya, a Brahmin of extraordinary learning" అని ప్రశంసించాడు.

"అనవద్య విద్యాసాగర విహార సుజనో పహార తారహార హీర డిండీర విస్తార యశోదారులగు ఛార్లెస్ సి.పి. బ్రౌన్ దొరవారి యుత్తరువు ప్రకారము పండిత మండల మండితులగు జూలూరు అప్పయ పండితులచే సరసముగ విరచింపబడిన - ప్రతి పద టీకా సహితము" మను చరిత్ర కావ్యం.

అప్పయ్య గుంటూరు జిల్లా వేటపాలెం (ప్రస్తుతం ప్రకాశంజిల్లా) వాస్తవ్యుడు బ్రౌన్ కోరిక మేరకు పెక్కు ఆంధ్ర గ్రంధములను పరిష్కరించాడు. ఇతనికి కవిగా పెద్ద పేరు లేదు కాని వ్యాఖ్యాతగా అగ్రగణ్యుడు. అప్పయ్య రచనలలో కృష్ణస్తుత్యాత్మకమైన యదు వంశ భూషణా శతకము, రామ పంచాశత్ కందం శ్రీవేంకటేశ్వరుని మీద విప్రలంభ శృంగారాత్మకమైన 27 పద్యాల శ్రీనివాస తారావళి అనేవి లభించాయి. అప్పయ్య పంతులు అత్యంత వినయ భూషణుడు అనటానికి క్రింది పద్యం ఉదాహరణం.

"తలపగ సాహితీ చతురతాలవలేశము లేదు, లక్షణం
బుల తెఱగెట్టిదో తెలియబోలదు, పూర్వకవి ప్రయోగవా
గ్విలసతమా యెఱుంగను గవిత్వము జెప్పబూనినాడన
న్నెలమి గృతార్థుజేయదగు గృష్ణ హరీ యదువంశ భూషణా (D. 1665)

మనుచరిత్ర, వసుచరిత్ర, కవికర్ణ రసాయన, విజయవిలాసాలకు వ్యాఖ్యానాలను రచించాడు అప్పయ్య.

"Zuluri Appayya was for more than twenty years enjoyed the reputation of being the most learned of Telugu Scholars. His patience, his humility and his good sense always commanded great respect" అని వ్రాసుకొన్నారు బ్రౌన్.

ఆముక్తమాల్యద, విష్ణుపురాణం, పద్మ పురాణం మొదలైన కావ్యాలను పరిష్కరించాడు. బ్రౌన్ మెచ్చిన బ్రౌన్‌కు నచ్చిన పండితుడు అప్పయ్య శాస్త్రి.

**రావిపాటి గురుమూర్తి శాస్త్రి:-** తెల్లదొరల కోసం తెలుగులో వాక్యగ్రంధాలు రచించిన వారిలో మొదటివాడు. తెల్లదొరలకు పాఠ్యగ్రంథంగా ఉపయోగపడాలని గురుమూర్తి శాస్త్రి విక్రమార్క కథలు అనేక వాక్య గ్రంధం వ్రాయగా 1819 లో కాలేజి బోర్డువారు దానిని అచ్చువేశారు.

కాలేజిలో (ఫోర్టుసెంట జార్జ్) ప్రధానాంధ్రోపాధ్యాయుడుగా సివిల్ సర్వెంట్లకు తెలుగు నేర్పాడు. పెద్ద ఉద్యోగాల్లో ప్రవేశించినప్పటికి దొరలు తమ సందేహాల నివారణ కోసం గురుమూర్తి శాస్త్రి గారికి జాబులు వ్రాసుకొనేవారు.

ఈయన రచించిన పంచతంత్రము సంస్కృత పంచతంత్రానికి వచనాను వాదం. ఇది కూడా పాఠ్యగ్రంథంగా ఉండేది. గురుమూర్తి వ్రాసిన తెలుగు వ్యాకరణం విలక్షణమైనది. వ్యావహారిక భాషలో ఆంగ్లవ్యాకరణ రచనా పద్ధతిలో ఉంది. ఈయనకు బంగారు కడియమును ఇచ్చి సత్కరించారట.

"I mention his name because his talents, learning and good sense always entitled his judgement to respect" అన్నాడు బ్రౌన్.

గురుమూర్తి శాస్త్రి 1835 ప్రాంతాల్లో 'రిటైర్' అయ్యారు. ఆయన పూర్వ విద్యార్థులెవరో అతనికి కడపజిల్లా కదిరి (అప్పట్లో) లో డిస్ట్రిక్ట్ మున్సిఫ్‌గా ఉద్యోగమిచ్చారు.

**తాతాచార్యులు, తిరుపతి :**– తాతాచారి కథలసంపుటిలో బ్రౌన్ ఇతనిని క్రింది విధంగా పరిచయం చేశాడు. నెల్లూరు దేశస్థుడైన తాతాచార్యులు కావ్య తర్క వ్యాకరణముల యందు నిండా ప్రవీణత గలవాడు. ప్లవనామ సంవత్సరమునకు సరి అయిన 1841 సం॥లో చెన్నపట్నంలో వుండే సి.పి.బ్రౌన్ దొరగారి వద్దకు వచ్చి తాను బ్రతికి వుండిన పరియంతము ఆయన వద్ద కొలువులో వుండినాడు. యీ తాతాచార్యులు నిండా పెద్దమనిషి సరసుడు గనుక సంభాషణలో సమయోచితమైన చిత్ర చిత్రకథలు చెప్పుతూ వచ్చినాడు

బ్రౌన్ కొలువులో చేరక పూర్వం ఈయన ఒక వీధిబడిని నిర్వహించినట్లు క్రింది లేఖవల్ల తెలుస్తున్నది. 'మహారాజశ్రీ బ్రౌన్ దొరవారి సముఖానకు – తిరుపతి తాతాచార్లు వ్రాసుకొన్నమనవి. – మా విద్యార్థులకు చూచి వ్రాసుకోవడమునకు నైషధం ప్రథమ వర్గ సవ్యాఖ్యానముగా నున్ను అమరం త్రికాండలు శుద్ధ ప్రతి మూలమును దయచేయ వలసినదని కోరుతున్నాను. వీటిని రెండు నెలలుగడవు వుంచుకొన దయచేయ వలసినది. చిత్తగించవలెను. తాతాచార్యుల వ్రాలు

బ్రౌన్‌కు అధ్యాపకుడుగా వ్యవహరించిన వాడు. పొడుగరి. స్థూలకాయుడు ఉభయభాషా విశారదుడు. వినమ్రుడు. తర్క జ్యోతిష వైద్యశాస్త్రములెరిగినవాడు. బ్రౌన్‌కు కావ్యాలను వివరించు సందర్భంలో చెప్పిన కథలకే, 1855లో బ్రౌన్ స్వయంగా ఆంగ్లాను వాదం ప్రకటించాడు.

తాతాచార్యులు పాండిత్య ప్రకర్షకు దూరంగా ఉండి పోయాడు. ఆయన కథలన్నీ వ్యావహారిక భాషలోనే రచించాడు.

**కంభం నరసింహాచార్యులు:** శశాంక విజయానికి వ్యాఖ్యానం వ్రాశాడు. విక్రమార్క చరిత్రము కాశీఖండము, హంసవింశతి, హరిశ్చంద్రో పాఖ్యానం మొదలైన కావ్యాలను పరిష్కరించాడు. సంస్కృత ఆనంద తంత్రమునకు వ్యాఖ్యను సమకూర్చాడు. రాఘవ పాండవీయ వ్యాఖ్యాత ఈయనే.

"శ్రీమద్రాజాధిరాజాతి తర వినుత వాక్చాతురీ వైభవేన ఫిల్లి ప్పార్లీసు బ్రౌనూ పరినృథమణినా సంతతం పోషితేన । శ్రీ మౌద్గల్యాన్వయ ప్రజనిత నరసింహార్య నామ్నాప్రణీతా టీకాశోకోపకర్త్రీ విజయతు విదుషాం మానసం తోషయ తీ"

బ్రౌన్ సేకరించిన సంస్కృతాంధ్ర గ్రంధాలన్నింటినీ వింగడించి వానికి పట్టికలను తయారుచేసి, కడప బంగళాలోని గ్రంధాలయాన్ని క్రమ బద్ధంగా తీర్చినాడు.

**చిలకమర్రి నరసింహాచార్యులు:** తారాశశాంకానికి చకోరీయ వ్యాఖ్య వ్రాసిన వాడు. సింహాసనద్వాత్రింశిక, శరభకవి హరిశ్చంద్ర చరిత్ర, ప్రభులింగ లీలలను పరిష్కరించాడు.

**సముద్రాల నరసింహాచార్యులు:-** కడపలోని బ్రౌన్ కాలేజిలో నౌకరు. ఆ కాలంలో జీతాలు సకాలంలో చెల్లించకపోతే సమ్మెలకు దిగేవారు కారు. 1834 సం॥లో బ్రౌన్ ఆర్థిక పరమైన ఇబ్బందులలో కూరుకొని తన పండితులకు రెండు నెలలు జీతం బకాయి పడినాడు. ఆ సమయంలో పండితులు సమిష్టిగా వినయ పూర్వకమైన వినతి పత్రాన్ని బ్రౌన్ కు పంపారు.

"తమ కాలేజి నౌకర్లు వ్రాసుకొన్న అర్జీ విన్నపం. మాకు జనేవరి నెల తాలుకు ఫెబ్రేవరి నెల తాలూకున్ను జీతములు యిదివరకు ముట్టకుండా వున్నది. మార్చినెల కూడా జరుగుతూ వున్నది.... మా మనవి ముఖ్యముగా చిత్తగించి సదరహీ రెండునెలల జీతమును దయ చేయించవలెనని మిక్కిలి వినయపూర్వకముగా వేడుకుంటూ వున్నాను. - [illegible]స్య చిత్తానకు తేవలెను.

అన 1834 సం॥ ది- 18 మార్చి

కంభం నరసింహాచార్య చేవ్రాలు

జూలూరి అప్పయ్య చే వ్రాలు — వెంకట నర్సు చేవ్రాలు

సముద్రాల నరసింహాచార్యుల చేవ్రాలు — వారణాశి రామస్వామి వ్రాలు

**వెంకయ్య గరిమెళ్ళ:-** కడపలోని బ్రౌన్ బంగళాలో ప్రతిదినం జరిగే సాహిత్య సంస్కరణోద్యమంలో ముఖ్య పాత్రధారి. ఉదయగిరి వాస్తవ్యుడు. కడప బంగళాలోనే నివసిస్తూ భారతారణ్య పర్వాన్ని పరిష్కరించాడు.

కవికర్ణరసాయనము, దశావతార చరిత్ర, సత్యభామాసాంత్వనము అనే కావ్యాలను పరిష్కరించుటయే గాక దశావతార చరిత్రకు వ్యాఖ్యానం రచించాడు.

Garimilla Vencaya of udayagiri, a young man, good scholar versed in prosody and a beautiful writer' అని బ్రౌన్ ప్రశంసనందుకొన్నాడు.

**పైడిపాటి వెంకట నరసయ్య :-** ఇతడు బ్రౌన్‌కు వ్రాసిన ఒక లేఖలో "తమ కవీశ్వరుడు పైడిపాటి వెంకట నరసయ్య' అని తన్ను పరిచయం చేసుకొన్నాడు. కవీశ్వరుడు కాబట్టే బ్రౌన చెన్నపట్టణములో కవీశ్వరుల యొక్కానున్ను, రాజుల యొక్కానున్ను పూర్వోత్తరములు పద్యాలుగా చెప్పే పనికి సిఫారసు చేసెను. మొదట కంభంలో ఉండి తర్వాత కడప బ్రౌన కాలేజికి వచ్చాడు. వైజయంతీ విలాసం, అనిరుద్ధ చరిత్ర, రాధికా సాంత్వనం మొదలైన కావ్యాలకు టీక వ్రాశాడు.

**తిప్పాభట్ల వెంకటశివశాస్త్రి :-** బ్రౌనకు ఒక విధంగా గురువు. బ్రౌనకు తెలుగు సాహిత్య స్పృహను కలిగించిన తొలి తెలుగు పండితులలో ప్రముఖుడు వేమన పద్యాలకు చిత్తు పేపరల్

## బ్రౌన్ రచనల కాలక్రమ సూచిక

1825 ఆంధ్ర శబ్ద చింతామణి - ఆంగ్లానువాదం (D. 1237) బ్రౌన్ దీనిని 23-7-1825. న మళ్ళీ 25.9.1827 న రెండుసార్లు అనువదించాడు అముద్రితం.

1825 జిల్లా నిఘంటువు

1827 ఆంధ్ర గీర్వాణ ఛందము, మద్రాసు. ఇది 1977 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారిచే పునర్ముద్రితం - ఛందోగ్రంథం.

1827 Notice regarding the names used in the Indian Zodiac MJLS, 1827 No. 33 వ్యాసం.

1828 Hindu Sculpture :- Asiatic journal.London 1828 V.No. Edition మొదట ఇది మదరాసు గెజెట్‌లో ప్రకటించినప్పుడు తన పేరు వేసుకోలేదు. వ్యాసం.

1828 'Suttee prevented' Asiatic Journal,London 1828 V.No. Edition. ఇది కూడా మొదట మదరాసు గెజెట్‌లో ప్రకటించినప్పుడు తన పేరు వేసుకోలేదు.

1829 Verses of Vemana, Moral religious and satirical, Madras 1939పునర్ముద్రితం తెలుగు కావ్యానువాదం.

1830 Essay on Trade మద్రాసు గెజెట్‌లో ముద్రించబడింది.

1837 A familiar Analysis of sanscrit Prosody, London 1869 లో లండన్ లోనే ఇది మళ్ళా ముద్రించబడింది. ఛందో గ్రంథం.

1838 'లూకాచేత వ్రాయబడిన శుభవర్తమానము, మద్రాసు (లూకా సువార్తకు తెలుగు అనువాదము)క్రైస్తవ మత సంబంధి.

1839-40 Essay on the Language and Literature of the Telugus, Madras (ఈ వ్యాసం మొదట Madras Journal or Literature and science లో రెండు భాగాలుగా 1839 జూలై అక్టోబర్ సంచికలోను, 1840 అక్టోబరు - డిసెంబర్ సంచిక లోను ప్రకటింపబడింది.) వ్యాసం.

1840 A grammar of the Telugu language - Madras 1857. లో మద్రాసులోనే మళ్లా ముద్రించబడింది. వ్యాకరణ గ్రంథం.

1840 ( Jan) Essay on the creed and customs and Literature of Jangams; అను పేరుతో Journal of Royal Asiatic Society లో 1871 లో మళ్ళా ప్రకటించబడింది. - వ్యాసం.

1840 ( Apr) Notice regarding the sects of Hindu called Tengala and vadagala - MJLs వ్యాసం.

1840 ( Jul) Notice of some Roman catholic Books existing in the Telugu language. MJLS - వ్యాసం.

1840 ( Oct) Account of the Basava Purana, the Principal Book used as religious code by the Jangams MJLS - వ్యాసం.

1840 ( Oct) Notice regarding mss in England - MJLS కుచేలోపాఖ్యానం - ప్రభుని 3 ఆశ్వాసాలకృతి, మద్రాసు - పరిష్కృతం.

1841 నలచక్రవర్తి కథ - రఘునాచారి కృత ద్విపద కావ్యం, మద్రాసు, పరిష్కృతం.

1841 Dialogues in Telugu and English for the use of learners with a grammatical analysis, Madras. ఇది 1853 లో మరోసారి మద్రాసులోనే ముద్రించబడింది. - వాచకం.

1841 సీతాకళ్యాణము, గరుడాచలము తెలుగు యక్షగానములు - మద్రాసు

1842 హరిశ్చంద్ర కావ్యము (ద్విపద) గౌరనకృతి - మద్రాసు నవనాథచరిత్ర నుంచి కూడా కొంత భాగం దీంతో కలిపి ముద్రించబడింది (పరిష్కృతం)

1843 ఆదిపర్వము (నన్నయ ఆంధ్ర మహా భారతములోనిది.) పరిష్కరణం

1844 వసుచరిత్ర-రామరాజు భూషణుని ప్రబంధం జూలూరి అప్పయ్య వ్యాఖ్యానం సహితం - మద్రాస్,పరిష్కృతం.

5.3.1844 హైదరు చరిత్ర. మరాఠీ గ్రంథానికి తెనుగు అనువాదం. పరిష్కర్త వేటూరి ప్రభాకర శాస్త్రి. ఆంధ్ర పత్రిక (దిన పత్రిక)లో వరుసగా 5-3-1944 నుంచి ప్రకటించబడింది.

1956 లో (ed.నిడుదవోలు వెంకటరావు గారు) గ్రంథం. మద్రాస్.

1844 Accounts of the tribes of Maharatt Brahmins; a translation of Maharatta Documents of the Mackenzie MSS.MJLS

1847 (Dec) On the numerals of Balaams name - Christian Observer London - వ్యాసం.

1847 Translation of the Telugu introduction to catalogue of Telugu and sanscrit MSS in the possession of C.P. Brown MJLS 1847 No. 33. వ్యాసం.

1849 వైజయంతీ విలాసం - సారంగుతమ్మయ్య కృతి. వ్యాఖ్యాన సహితం - పరిష్కృతం.

1849 Memoirs of Hyder Ali and Tippu Sultan, Madras - మరాఠీ నుంచి లఘు వివరణలతో ఇంగ్లీష్‌లోనికి చేసిన అనువాదం.

1850 కవి రత్నాకరము (సంస్కృతము - తెలుగు లిపి) మద్రాసు. పరిష్కృతం 1865 లో రెండో ముద్రణ.

1850 Cycle of Table of Hindu and Mahomedan chronology, Madras.

1851 కీర్తనలు LXVII (చంపూకావ్యం) మద్రాసు, క్రైస్తవ మత సంబంధి.

1851 మనుచరిత్ర - అల్లసానిపెద్దన కృతి. జూలూరి అప్పయ్య వ్యాఖ్యాన సహితం. మద్రాసు-పరిష్కృతం.

1852 జిల్లా నిఘంటువు - మద్రాసు

1852 'బ్రౌణ్య ఇంగ్లీష్ - తెలుగు నిఘంటువు' - మద్రాసు (ఇది 1895 లో యం.వెంకట రత్నం గారిచే పరిష్కరింపబడింది. 1974 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారిచే పున్ముద్రింపబడింది.

1852 'బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువు' మద్రాసు (ఇది 1903 లో మద్రాసులోనే ఎం.వెంకటరత్నం, W.H. Campbell, కందుకూరి గార్ల సంపాదకత్వం లో పరిష్కరింప బడింది. 1966 లో ఆంప్ర. సాహిత్య అకాడమి,హైదరాబాద్ వారిచే బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు తో కలిపి. మళ్ళా ముద్రించబడింది.

1852 'నిస్తర రత్నాకరము' The Jewel Mine of Salvation' - ఇది ఒక అజ్ఞాత కవి

చేత వ్రాయబడింది. క్రైస్తవ మత సంబంధమైన పద్యకావ్యం. దీనినే పెంపుచేసి తమిళంలో కూడా ముద్రించారు.

1852 'A catalogue of Irregular Verbs in English Language' - Madras (వ్యాకరణ గ్రంథం)

1852 English Translation and Exercises and documents printed in the Telugu Reader - Madras. (ఈ వాచకం 1865-67లో రెండో సారి ముద్రించబడింది.)

1852 The Telugu Reader ఆంధ్ర మార్గదర్శి - తెలుగు రీడరు - మద్రాసు (ఈ వాచకం కూడా 1865-67 లో మళ్ళా ప్రకటించబడింది.

1852 Three teatises on Mirasi Right by F.W. Ellis, Lt col Blackburne, Sir Thomas Munroe with the remarks made by the Hon Madras court of directors 1822 & 1824 edited. Historical.

1852 Vakyavali or Exercises in Idioms - English and Telugu, Madras (ఇవి సంస్కృత ఛందస్సులో కూర్చబడి తెలుగు లిపిలో ప్రకటించబడ్డాయి. క్రైస్తవ మత సంబంధం.)

1853 The wars of Rajas - Madras అనంతపురం రాజుల చరిత్ర తెలుగు నుంచి ఇంగ్లీష్ లోకి అనువదింప బడింది. The annals of Hande Anantapuram అనే పేరుతో, ఇది గురజాడ అప్పారావు గారి పరిష్కరణతో మళ్ళా ముద్రించబడింది.

1853 'సాలు చరిత్ర' తెలుగు లిపిలో ఉన్న సంస్కృత పద్య కావ్యం. క్రైస్తవ మత సంబంధి. మద్రాస్.

1854 బ్రౌణ్య మిశ్రభాషా నిఘంటువు - మద్రాసు (ఇది 1903 లో మద్రాసులో ఎం. వెంకటరత్నం, H.H. Campbell, కందుకూరి గారి సంపాదకత్వంలో పరిష్కరించ బడింది. 1966 లో ఆం.ప్ర. సాహిత్య అకాడమి హైదరాబాద్ వారిచే బ్రౌణ్య - తెలుగు - ఇంగ్లీష్ నిఘంటువు తో కలిపి తిరిగి ముద్రించబడింది.

1855 తాతాచారి కథలు (తెలుగులో - మద్రాస్) గురుజాడ అప్పారావు గారు దీనిని పరిష్కరించగా మద్రాసులో 1926 లో ప్రకటితం. 1951 లో మళ్లా ముద్రించబడింది. 1974 లో బంగోరె గారిచే మద్రాసు లోనే మరోసారి ప్రకటించబడింది.

1855 మిరాశివాదము - మద్రాస్ (ఇది తెలుగులో రచింపబడి, ఇంగ్లీష్ లోనికి అనువదింపబడింది.)

1855 English and Hindustani phrasealogy or exercises in Idioms of English and Dakshini -Hindustani - Madras (వ్యాకరణ గ్రంథం)

1859 The experience of A Nicholas' (Edited in English verse) London (క్రైస్తవ మత సంబంధం)

1861 A Titular Memory - London (ఇది చారిత్రకం - ప్రస్తుతం అలభ్యం. దీనిని డా. కొత్తపల్లి వీరభద్రరావుగారు పేర్కొన్నారు. సి పి.బ్రౌన్ పుట 260.

1863 Carnatic chronology, London (ఇది చారిత్రకమే)

1864 (Jul) Telugu spells MJLS కడప క్రిమినల్ డాక్యుమెంటులకు తెలుగు నుంచి ఇంగ్లీష్ లోనికి అనువాదం.

1866 Some Account of the Literary life of Charles Philip Brown, London (Revised edition. London - 1872) దీనిని నిడదవోలు వారు తెలుగు లోకి అనువాదం చేసి 1963 మే నెల భారతి లో ప్రకటించారు. - స్వీయచరిత్ర.

1871 On Malabar, Coramandal quilon etc. JRAS-London

1871 Essays on the creed and customs of Jangams,JRAS,London.

1909 Popular Telugu tales by Tatachari Madras. (ఇది తాతాచారి కథలకు ఇంగ్లీష్ అనువాదం)

1953 వాణీవిలాస వనమాలిక (టేకుమళ్ళ రంగసాయి)కు ఇంగ్లీష్ వ్యాఖ్యానం, మద్రాస్.

1967 Verses of Vemana in Telugu orginal with English renderings,A.P. Sahitya Academy - 1977 లో పునర్ముద్రితం.

1973 "Sumati Satakam" in Telugu original with English Renderings by C.P. Brown - AP Sahitya Academy (ఈ తెలుగు అనువాదానికి సంపాదకుడు - డా|| సి.ఆర్.శర్మగారు.

## అముద్రితాలు - వివరాలు తెలియనివి

అప్పకవీయం - ఆంగ్లానువాదం

అమరకోశం - (సంస్కృతం) తెలుగు వ్యాఖ్యానసహితం - మద్రాస్‌లోనే ముద్రించబడింది కాని కాలం ఎప్పుడో తెలియదు.

అహల్యకథ - పద్మపురాణంలో ఆంగ్లానువాదం - అముద్రితం

అహల్యావృత్తాంతం -దశావతార చరిత్ర లోనిది - ఆంగ్లానువాదం అముద్రితం

కవిజనాశ్రయం - ఆంగ్లానువాదం

కవిశిరోభూషణం - ఆంగ్లానువాదం

పదనిధి (D. 1385): ఈ నిఘంటువు 1841లో వ్రాయబడింది. అముద్రితం.

ప్రభులింగలీల - ద్విపద కావ్యం (3వ ఆశ్వాసంలోని ఒక భాగానికి చేసిన ఇంగ్లీష్ అనువాదం.

బాల సరస్వతీయం - ఇంగ్లీష్ అనువాదం

భగవద్గీత - (సంస్కృతం - తెలుగులిపి) ఈ పరిష్కృత గ్రంథం మద్రాసులో ప్రచురింపబడిన కాలం ఎప్పుడో తెలియదు)

రేఫఱకారవచ్ఛబ్దజ్ఞాపక లోకోపకారము :- (R-597R, 1209D, 2154) అముద్రితం.

"A summary of and an explanatory note in English on VaniVilasa Vanamalika (A Telugu metrical encyclopedia of Hindu literature) of Tekumalla Ranga Sayi. ఇది ప్రచురణ వివరాలు తెలియని వ్యాసం.

'Common Prayer Book' ఇది మద్రాసులో ముద్రించబడింది. కాలం ఎప్పుడో తెలియదు క్రైస్తవమత సంబంధం. (సమగ్ర ఆంధ్రసాహిత్యం - 9వ సంపుటం - కుంఫిణీయుగం) - డా. ఆరుద్ర.

## చాటువులు - బ్రౌన్ సేకరణ

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో బ్రౌన్ దొర సేకరించిన చాటువుల సంకలన కాగితపు ప్రతులున్నాయి. వాటిలో కొన్నిటిని మాత్రం పరిష్కరించి, యథాతథంగా, ఎంగడింపు చేయకుండ - క్రింద పొందుపరచాను.

**కీర్తిని గురించిన పద్యము**

సీ॥ చినుకు పూవుల నొనర్చిన బిత్తరపుదండ
దండాలు గలవేల్పు తపసి కొండ (దండి+అలు)
కొండాటములకుఁ జిక్కులఁబెట్టు జడదారి
దారిదప్పక గట్టుఁ జీరుటలుగు
అలుగుటింతికి వెన్నుఁడిలకుఁ దెచ్చిన చెట్టు
చెట్టు గట్టఁగఁ జేయు చెలువతోడు
తోడాన పడు క్రీడి దొర నెఱితోఁ బుట్టు
పుట్టు లిబ్బుల తేని పొందుగాఁడు

గీ॥ కాదు కనపపుల్ గాంచిన గండుతల్లి
తల్లి బిడ్డలఁ బెండ్లాడు గొల్లమనికి
మనికితము దీర్చు విలుకాని జనకు విందు
విందు నీకీర్తి నరసింహ విభుని కృష్ణ

సీ॥ భామరో నీ రూపు భావింపు దామంటె
బాగైన బంగారు ప్రతిమ నీవు
చెలియరో నీ మోవి చేరి చూదామంటె
రత్నంపు ఛాయఁ రవలు దీరు
పణతి నీ పా ంధ్లఁబట్టి చూతామంటె
సంపెంగ బంతుల సాటిరావు
అతివ నీ పలుకులు నాలకించెదనంటె
గుఱుతైన కోయిలల్ కూయలేవు

గీ॥ కలికి యిఁకనైన నామీద కరుణ కలిగి
విభుఁడు నానాడు యిషుమతి విభమెఱింగె
వనిత నీవేగి శ్రీశైల వాసుఁడైన
మల్లికార్జునుఁదేగదే మధుర వాణి